# ప్రథమ ఖండం

## 1

రథసప్తమి మాఘ శుద్ధ సప్తమి రోజున జరుపుకునే అత్యంత పవిత్రమైన పండుగ. అరుణ రథసారథిగా బంగారం పూన్చిన ఏడుగుర్రాల రథంపై సూర్యుడు గమనం సాగిస్తాడని ప్రజల నమ్మకం. ఈ గమనం ఉత్తరాయణము, దక్షిణాయణము అని రెండు రకములు. ఉత్తరాయణానికి ప్రారంభాన్నే రథసప్తమిగా జరుపుకుంటారు. ఇది కొత్త సంవత్సరాదిని కూడా సూచిస్తుంది. రథసప్తమి తరువాత వాతావరణం వసంత ఋతువులోకి ప్రవేశిస్తుంది. కాబట్టి వ్యవసాయదారులందరు రథసప్తమి తర్వాత కోతలకి దిగుతారు. రథసప్తమి రోజున అన్ని దేవాలయాలలోను ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. ఇంక సూర్యునికే ప్రత్యేకమైన సూర్యదేవాలయాల్లో ఈ వేడుకలు ఇంకా ఘనంగా జరుగుతాయి.

కశ్యపాపురం అనే నగరం దాని చుట్టూ ఉన్న గ్రామాలతో కలిపి ఒక సామ్రాజ్యంగా ఉంది. దీనినే కశ్యపాపురం మహాసామ్రాజ్యం అని పిలుస్తారు. ఇక్కడి సూర్యదేవాలయం ఈ ప్రాంతం వారికే కాక ప్రపంచంలోని సూర్యుడిని ఆరాధించే సాంప్రదాయం ఉన్న వారందరికి అత్యంత పవిత్రమైన దేవాలయం. దీనిని మహాభారత కాలంలో శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడు నిర్మించాడని స్థలపురాణం ద్వారా తెలుస్తుంది. ఈ దేవాలయం ఉన్న ప్రాంతాన్ని మూలస్థానంగా పిలుస్తారు. మూలస్థానం నుండే మానవుని పుట్టుక జరిగిందని, ఇక్కడే నాగరికతను అలవరచుకున్నారని ప్రజల నమ్మకం. అందుకే ఈ సామ్రాజ్యం దేవతల ఆశీస్సులతో సారవంతమైనదిగా, సిరిసంపదలతో వర్ధిల్లుతుందని ప్రతీతి. సూర్యదేవాలయంలోని మూలవిరాట్ అయిన ఆదిత్యదేవుని విగ్రహం చెక్కతో చేయబడింది. అది ఎర్రటి చర్మంతో కప్పబడి, కెంపులు పొదిగిన కళ్ళతో ఆదిత్యదేవుడు రౌద్ర రూపంలో దర్శనమిస్తాడు. ఈ రథసప్తమి రోజు మూలవిరాట్ పాదాలపై సూర్యకిరణాలు పడటమే కాకుండా, కెంపులు పొదిగిన కళ్ళు ప్రకాశవంతంగా మెరుస్తుంటాయి. ఈ అద్భుతం చూపరులను తన్మయత్వానికి గురిచేస్తుంది. ఇలాంటి అద్భుతాలను చూడటానికి దేశవిదేశాల భక్తులు ఇక్కడికి తరలివస్తారు.

ప్రతి సంవత్సరం ఇక్కడ రథసప్తమి వేడుకలను అత్యద్భుతంగా నిర్వహిస్తారు. అత్యంత భక్తిప్రపత్తులతో హెూమం నిర్వహిస్తారు. మూలవిరాట్‌ని, పవిత్ర ఖడ్గాన్ని పూజిస్తారు. శత్రువినాశనం చేసే శక్తి ఆ ఖడ్గానికి ఇవ్వమని ప్రార్థిస్తారు. సూర్యుని రథానికి ఉన్న ఏడు గుర్రాలకు, మనిషి శరీరంలోని ఏడు శక్తి చక్రాలకు ప్రతీకగా ఏడుసార్లు శంఖం పూరిస్తారు. సుమారు మూడవ శంఖం పూరించిన తర్వాత రాజు ఆలయ ప్రాంగణంలోకి ప్రవేశించటం ఆనవాయితీగా ఉంది. కశ్యపాపురం రాజు రథసప్తమి రోజు జరిగే వేడుకలలో మాత్రమే ప్రజలకు దర్శనమిస్తారు. మిగిలిన రోజులలో రాజును విదేశాల నుంచి వచ్చే ప్రతినిధులు, కవులు, కళాకారులు మాత్రమే కలిసే అవకాశం ఉంటుంది. ఇంక రాచకార్యాలను మంత్రులు, ఇతర అధికారులు రాజు ప్రమేయం లేకుండా చక్కదిద్దుతారు. అందుకే ఈ వేడుకలలో రాజును చూడటం కూడా ప్రజలందరు అదృష్టంగా భావిస్తూంటారు. దేవాలయ ప్రాంగణమంతా వివిధ ప్రదేశాల నుండి వచ్చిన భక్తులతో రకరకాల దుకాణాలతో కోలాహలంగా ఉంది. విశాలమయిన దేవాలయ ప్రాంగణమంతా జనసముద్రంలా కిక్కిరిసిపోయింది. ధనవంతులైనవారు అంబారీలలో వచ్చి దేవాలయం ముందు దిగి, నేరుగా దేవాలయం లోనికి వెళ్తున్నారు.

ఇప్పుడు జరుగుతున్న వేడుకలు చాలా విశేషమైనవి. ఈసారి జరిగే వేడుకలలో యువరాజు పట్టాభిషేకం జరగబోతుందని క్రితం సంవత్సరం జరిగిన వేడుకలలో ప్రకటించారు. ప్రతి సంవత్సరం వేడుకలలో ఏడవసారి శంఖం పూరించిన తరువాత రాజు ప్రజలనుద్దేశించి ప్రసంగించటం, ప్రజలందరికి స్వయంగా కొన్ని కానుకలను ప్రకటించటం ఆనవాయితీగా వస్తుంది. ఎంతో ఆడంబరంగా కనిపించే రాజును ప్రత్యక్షంగా దర్శించుకోవటమే ఒక కానుక అనుకునే ఇక్కడి ప్రజలకు ఇంక యువరాజు పట్టాభిషేకం కావటంతో వారిలో ఈ వేడుకల మీద అంచనాలు పెరిగిపోయాయి. వారి అంచనాలకు ఊతమిస్తూ ఈసారి వేడుకల ఏర్పాట్లు కూడా అంతే ఘనంగా చేశారు. సూర్యదేవాలయం మునుపెన్నడూ లేని కొత్త శోభను సంతరించుకుంది. ప్రజలందరు భక్తి ప్రపత్తులతో ఉత్సాహంగా వేడుకలలో పాల్గొంటున్నారు. **కొంతమందికి మాత్రమే తెలుసు కొద్దిసేపట్లో అక్కడ ఏమి జరగబోతుందో.**

ఒకపక్క పూజా కార్యక్రమం జరుగుతుండగా ఆలయ ప్రాంగణంలోని వేదికపైన రాజ్యాన్ని, రాజవంశాన్ని కీర్తించే నాటకాలు, కీర్తనలు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతున్నవి. రాజును దైవాంశ సంభూతుడుగా, ఇంకా చెప్పాలంటే దైవంగా చేసి గుళ్ళు కట్టేవరకు వెళ్ళింది ఈ సాంప్రదాయం. వీటన్నింటిని రాజు ప్రమేయం లేకుండా, రాజు దగ్గర తమ పలుకుబడిని పెంపొందించుకోవాలనుకునేవారు ఏర్పాటు చేస్తుంటారు.

ముందు తరాలలో కళలలో ప్రవేశం ఉన్న వారు స్వయంగా ముందుకు వచ్చి ఇలాంటి వేడుకలలో పాల్గొనేవారు. ప్రస్తుత పాళనరసింహుడి కాలం వచ్చేసరికి ప్రతి దాన్ని ధనం, పలుకుబడి దృష్టితో చూడటం అలవాటయింది. పలుకుబడిని, కళలను ధనంగా మార్చివేసే ప్రక్రియలో అందరూ ఆరితేరారు. అందుకే ఇలాంటి కృత్రిమమైన కీర్తించే కార్యక్రమాలు. మధ్యమధ్యలో వాటిని ఏర్పాటుచేసిన వారి పేర్లను, హోదాను ప్రకటించి కరతాళ ధ్వనులతో అభినందించమని కూడా అభ్యర్థిస్తున్నారు. ఇంచుమించుగా ప్రతి సంవత్సరం ఇలాంటి వాటిని చూస్తున్న అక్కడి ప్రజలు నిరాసక్తతతో ఉన్నారు. తీర్థయాత్రకు వచ్చిన ఇతర ప్రాంతాల వారు మాత్రం కొంత ఆసక్తితో వాటిని అనుసరిస్తున్నారు. ఇదే అదనుగా దేవాలయ ప్రాంగణంలో చిన్న చిన్న దొంగతనాలు చేసేవారు తమ చేతివాటం చూపిస్తున్నారు.

ఇంతలో మేళతాళాలు, జయజయధ్వానాలతో ఆ ప్రాంగణంలో హడావిడి మొదలైంది. ముందు కొంతమంది ఆశ్వికదళ సైనికులు, వారి వెనుక పదాతిదళాల వారి రక్షణలో మహారాజు పాళనరసింహుడు మరియు రాజగురువు కపిలదత్తుల వారు ఆసీనులై ఉన్న రథం దేవాలయ ప్రాంగణంలోకి వచ్చింది. పాళనరసింహుడు విలువైన కంఠాభరణాలు, పట్టువస్త్రాలతో ఆడంబరంగాను అతని పక్కనే రాజగురువు రాజదండాన్ని పట్టుకుని ఠీవిగా రథంలో ఆశీనులై వున్నారు. పట్టాభిషిక్తుడు అవుతాడనుకున్న యువరాజు కనిపించలేదు. దానితో అక్కడ ఉన్న ప్రజలలో ఆందోళన మొదలైంది. **అప్పటివరకు ఊహాగానం అనుకున్నది నిజమవ్వబోతుందేమో అనే భయం పట్టుకుంది.** ఇంతకీ యువరాజు ఎక్కడ ఉన్నట్టు, ఎందుకు రానట్లు అనే సందేహం అందరికీ కలిగింది.

రాజ్యంపై ఏ క్షణంలోనైనా దండయాత్ర జరగొచ్చనే సమాచారంతో రాజు విజ్ఞాపన మేరకు యువరాజు విజయనరసింహుడు, రాజగురువు కుమారుడు నరేంద్రుడు ఇవ్వాళ రాజమందిరంలోనే ఉండిపోయారు. రెండంతస్తుల రాజమందిరంలో పైన అంతస్తులో ఉన్న రాకుమారుడి గది విశాలంగా ఉంది. విజయనరసింహుడు తన స్నేహితుడైనప్పటికీ నరేంద్రుడు ఇంతకు ముందెన్నడు ఈ గదికి రాలేదు. ఆ గది అద్భుతంగా అలంకరింపబడినది. మెత్తటి పాన్పులు, కిటికీలకు వేలాడుతున్న పట్టుతెరలతో అందంగా రాజదర్పం ఉట్టిపడుతోంది.

ఇద్దరూ పిచ్చాపాటి కబుర్లలో మునిగిపోయారు. కాని ఎక్కడో చిన్న భయం వారిని వేధిస్తూనే ఉంది. ముఖ్యంగా స్వతహాగా భయస్తుడైన నరేంద్రుడిని. కాని ఎటువంటి అలజడి రేగినా తాము తప్పించుకోవడానికి ఏర్పాట్లు జరిగాయి అనే ధైర్యం కూడా వారికి ఉంది. బయట నుండి చిన్న శబ్దం వినిపించింది. నరేంద్రుడు గాబరాగా కిటికీ

వద్దకు వచ్చి తెరను కొంచెం తొలగించి బయట ఏమి జరుగుతుందో చూశాడు. రాజమందిర ప్రాంగణమంతా సాయుధులైన సైనికులు పహారా కాస్తున్నారు. కొద్దిదూరంలో ఆశ్విక దళాలు అటూ ఇటూ సంచరిస్తున్నాయి. చూడటానికి మాత్రం రాజమందిరం శత్రుదుర్భేద్యంగా ఉంది. ఈ సైన్యాన్ని దాటుకొని శత్రువులు మందిరంలోకి రావటం అంత సులభం కాదనిపించి కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు నరేంద్రుడు.

నరేంద్రుడి దృష్టి విశాలంగా ఉన్న కశ్యపాపురం నగరంవైపు మళ్ళింది. విశాలమైన రహదారులు, వాటి ప్రక్కన ఒక క్రమంగా పెంచిన చెట్లు, అందమైన ఇళ్ళతో నగరం సుందరంగా కనబడుతోంది. రహదారులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. రోజూ ఈపాటికి పనులకు వెళ్ళేవారితో, అంగడికి వచ్చేవారితో వీధులు కిటకిటలాడేవి. నగర ప్రజలంతా సూర్య దేవాలయం వేడుకలలో ఉండి ఉంటారు అని నరేంద్రుడు అనుకున్నాడు. రాజ్యం మొత్తాన్ని ఒకేసారి పరిశీలించి చూడటం నరేంద్రునికి ఇదే మొదటిసారి. నరేంద్రునికి కనబడుతున్నది ఈ అందమైన జీవితాలు, తను రోజూ చూస్తున్నది ఇప్పుడు చూస్తున్నది కూడా వాటినే. కానీ రాజ్యానికి దూరంగా తన కంటికి కనబడని, తాను ఊహించలేని ప్రదేశాలు, జీవితాలు కూడా ఉన్నాయి అనేది తనకి తెలిసే అవకాశం లేదు. **అవన్నీ తన రాజ్యంలోవే అంటే నరేంద్రుడు నమ్మలేడేమో!**

తన చూపు కొంచెం పక్కకి మరలగానే ఆకాశంలో దేదీప్యమానంగా వెలిగిపోతూ, తన కిరణాలతో వెలుగును నింపుతున్న సూర్యభగవానుడు, ఆ వెలుగులో ప్రకాశిస్తూ, జాతి కీర్తికి నిలువెత్తు నిదర్శనమైన సూర్యదేవాలయ గోపురం కనిపించాయి. దానిని చూసిన తరువాత తన మనస్సు ప్రశాంతంగా అనిపించింది. భగవత్ రక్ష ఉంటే తమకు ఎలాంటి భయం లేదనుకున్నాడు. ఇంతమంది యుద్ధవీరులు ఉన్న ఈ రాజ్యం, పండితుల వేదఘోషతో ప్రతిక్షణం భగవత్ నామస్మరణ చేస్తూ ధర్మాన్ని పాటిస్తున్న ఈ భూమి పరుల వశం కావటం ఊహించలేనిది అనుకున్నాడు. కానీ శత్రు సైనికులు యుద్ధ నైపుణ్యం కలవారు, శారీరక బలం కలవారన్న విషయం గుర్తొచ్చింది. ఒకపక్క ధైర్యంగా ఉన్నట్లు అనిపిస్తున్నా జరగబోయే పరిణామాలు ఎలా వుంటాయో అనే ఆలోచనలు మనసునిండా సుడులు తిరుగుతున్నాయి. కళ్ళు తదేకంగా దేవాలయ గోపురం మీద దృష్టి పెట్టినా మనసునిండా కీడెంచే ఆలోచనలే. మళ్ళీ బయట ఏదో శబ్దం అవటంతో తన దృష్టి ఆకాశం నుండి దూరం నుంచి వస్తున్న ప్రవాహం లాంటి సైన్యం మీద పడింది. వారందరూ రాజమందిరం వైపుకే కదం తొక్కుతున్నారు. ఆశ్విక, పదాతి దళాలు కనుచూపుమేర అంతం లేకుండా కనిపిస్తున్నాయి. నరేంద్రునిలో ఆందోళన మొదలైంది. తాను లీలగా ఊహించింది, ఇప్పటి వరకు జరిగే అవకాశం తక్కువని తన మనసును

ధైర్యపరచుకున్న దృశ్యం ఇప్పుడు కళ్ళముందు కనపడేసరికి నరేంద్రుని భయం రెట్టింపై చెమటలు పట్టాయి.

వారు రాజమందిరాన్ని సమీపించగానే అప్పటి వరకూ చేతుల్లో ఖడ్గాలతో పహారా కాస్తున్న సైనికులు ఒక్కొక్కరు ఖడ్గాన్ని ఒరలోకి దింపి శ్వేతవర్ణపు వస్త్రాన్ని గాలిలో ఊపుతూ లొంగిపోతున్నట్లు ప్రకటిస్తున్నారు. అలా నమ్మకద్రోహం చేస్తున్న వారందరిని ఆశ్చర్యంతో, విస్మయంతో చూస్తున్నాడు నరేంద్రుడు. వారందరు పోరాడకుండా శత్రువుకు ఎందుకు లొంగిపోతున్నారో తనకి అర్థం కాలేదు. ఇంక తమకు ఆఖరి గడియలు సమీపించాయని అనుకున్నాడు. ఇంతలో గది తలుపులు ఎవరో తడుతున్న శబ్దం వచ్చింది. దానితో నరేంద్రుడు మరింత భయంతో వణికిపోయాడు. తలుపులు తెరవాలో లేదో అర్థంకాక నరేంద్రుడు, విజయనరసింహుడు ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. మొదట కొద్దిగాను తరువాత క్రమక్రమంగా వేగంగా ఆ శబ్ధం వినిపిస్తోంది. విజయనరసింహుడు ధైర్యాన్ని తెచ్చుకొని ఖడ్గాన్ని తన చేతిలోకి తీసుకుని తలుపును కొద్దిగా తెరచి చూశాడు. బయట ఉన్నది దాసు కావటంతో ఇద్దరు ఊపిరి పీల్చుకున్నారు. దాసు ఆందోళనగా లోపలికి వచ్చి త్వరగా తనవెంట బయలుదేరమన్నాడు. తన వద్ద ఉన్న సాధారణ సైనిక దస్తులను రాజకుమారుడిని ధరించమని ఇచ్చాడు.

వారు ముగ్గురు ఆ గది నుండి బయటపడి, ఒక్కొక్క గదిని దాటుకుంటూ రాజ మందిరం వెనుక ద్వారంవైపు వెళ్తున్నారు. నరేంద్రునికి భయంతో గుండె వేగంగా కొట్టుకుంటోంది. శరీరం అంతా జలపాతంలా చమటలు పట్టి చల్లబడింది. దాసు, విజయనరసింహుడు ధైర్యంగా ముందుకెళ్తున్నారు. నరేంద్రుడు చేయగల్గుతుందల్లా భయంతో అరవకుండా నోటిదగ్గర చేయి పెట్టుకొని వారిద్దరిని అనుసరించడమే. దాసు వారిద్దరిని కోట వెనకాల ఉన్న రహస్యమార్గం దగ్గరికి తీసుకెళ్తున్నాడు. కోట వెనక రహస్యమార్గం ఒకటి ఉందని దాసుకు కూడా వారం ముందటే తెలిసింది. అది నేరుగా రాజ్యం ఆవల ఉన్న అడవిలోకి దారి తీస్తుంది. ప్రతి వంద నూటయాభై అడుగులకి అది రెండుగా చీలిపోతూ బాగా తెలిసినవారికి మాత్రమే అది సురక్షితమైన మార్గం. తెలియనివారికి ఒక మృత్యు మార్గం.

అంతా దాసు అనుకున్నట్లే జరుగుతోంది. తను రహస్య మార్గాన్ని చేరితే తనకప్పగించిన పనిలో విజయం సాధించినట్లే. దాసు ఆ ఇద్దరు ప్రాణస్నేహితులతో కలిసి రహస్యమార్గం ముఖద్వారం వద్దకు వచ్చాడు. అప్పుడు దూసుకొచ్చింది ఒక బాణం. అది ఇద్దరు ప్రాణ స్నేహితులలో ఒకరి గుండెను చీల్చుకుంటూ వెళ్ళి రక్తాన్ని చిమ్మింది. దాసు వెనక్కి తిరిగి చూశాడు. ఆ బాణం వచ్చింది తన స్నేహితుడి విల్లు నుంచి.

ముఖంలో ఎటువంటి భావం లేకుండా తన స్నేహితుడి వైపు చూశాడు దాసు. అతను మాత్రం చిరు దరహాసంతో, విజయం సాధించిన కళ్ళతో సంతృప్తిగా కనిపించాడు. వెంటనే దాసు అడ్డంగా నిల్చున్నాడు. దాసు అడ్డు రావటంతో అతని స్నేహితుడు కంగారుగా ఇతర సైనికులను విల్లులు క్రిందికి దింపమని వారించాడు. రెప్పపాటులో వారిద్దరు రహస్య మార్గంలోకి వెళ్ళారు. రహస్య మార్గం అవతలికి చేరిన తర్వాత అప్పటికే సిద్ధంగా ఉన్న అశ్వం మీదకు ఎక్కారు. దాసు కళ్ళాన్ని అదిలించటంతో అది దుమ్మును రేపుతూ అడవిలోకి పరుగుతీసింది. రేగిన దుమ్ములోనే అశ్వం, దానితోపాటు వారిద్దరు అదృశ్యమయ్యారు.

**ఇంతకీ దాసు స్నేహితుడి బాణానికి బలైంది ఎవరు?**

## 2

**ర**థసప్తమికి ఆరునెలల ముందు ................

'మాలేగనిమత్" విజయం వలన లభించిన ఆదాయం, దోచుకున్న డబ్బుకు ప్రవక్త మహమ్మద్ పెట్టిన పేరు. ఇందులో ప్రభుత్వ వాటా అయిదు వంతులకు గాను ఒక వంతు, దీనినే 'బైతుల్‌మాల్' అంటారు. మిగిలిన నాలుగు వంతులు ఆ యుద్ధంలో పాల్గొన్నవారు సోదరభావంతో పంచుకుంటారు. నిశ్చలతా, భరోసా, స్థిరమైన ఆదాయంలేని జీవితాన్ని అనుభవిస్తున్న అరబ్‌లకు ఇలాగైనా ఆదాయం కళ్ళచూడటం ధైర్యాన్ని ఇచ్చింది. అందుకే ఆయుధం పట్టగలిగిన వారందరికీ ఇస్లాం ఒక ఉపాధి మార్గంగా కనిపించింది. బలమైన ఆధ్యాత్మికతతోపాటు స్థిరమైన ఆదాయం, బలవంతం మూలాన అరబ్ లందరు తండోపతండాలుగా ఇస్లాంలో చేరారు. కాని తమ జీవితం మొత్తం యుద్ధాలకే సరిపోతూ, సంపాదించింది అనుభవించే అవకాశం లేకపోవటంతోను, ఇస్లాం శాఖోపశాఖలుగా విడిపోవటంతో ఇప్పుడు యుద్ధాలు చేస్తున్నది దేవుడి రాజ్య స్థాపనకోసం కాదని, అధికారం కోసమేనని వారికి అర్థం కావటం వలన వారిలో ఆలోచన మొదలైంది. తాము **ప్రాణాలకు తెగించి యుద్ధం ఎవరికోసం చేస్తున్నామనే ప్రశ్న వారిని వేధిస్తోంది.**

దమాస్కస్‌ను రాజధానిగా చేసుకుని అతి వేగంగా విస్తరిస్తున్న ముస్లిం ప్రపంచానికి తిరుగులేని అధిపతి మతాధికారి ఉమ్మాయద్. ఇస్లాం ప్రపంచంలో మతాధికారి, రాజ్యాధికారి వేరుకాదు. ఖురాన్ పట్టుకొని మతప్రవచనాలు చెప్పేవారే ఖడ్గధారులై యుద్ధాలు కూడా చేస్తారు. ఉమ్మాయద్ ఆధ్వర్యంలో తన ముఖ్య సైనికాధికారి అబ్దుల్ ఖాసిం అవిశ్వాసుల మీద యుద్ధం, ఇస్లాం రాజ్య స్థాపన అనే నినాదాలతో వరుస విజయాలను సాధిస్తున్నాడు.

ఖాసిం ఇప్పటివరకు చేసిన యుద్ధాలలో లొంగిపోయిన వారిని బహిరంగంగా అందరి ముందు వధిస్తున్నాడు. చరిత్రలో జరిగిన యుద్ధాలన్నింటిలో లొంగిపోయిన సైన్యాన్ని తమ సైన్యంలో చేర్చుకుని ఇంకా బలవంతులయ్యేవారు. కానీ ఖాసిం మాత్రం వారిలో కొంతమందిని బహిరంగంగా వధించి తమ శత్రువులను భయపెట్టేవాడు. ఇదంతా ఉమ్మాయద్ ఖాసింకి ఇచ్చిన రహస్య ఆదేశాల ప్రకారం జరుగుతుంది. దానితో ఖాసిం విజయవంతమైన సైనికాధికారిగా మాత్రమే కాక ఒక క్రూరుడైన ఉన్మాదిగా కూడా అపకీర్తిని మూటగట్టుకున్నాడు. కొద్ది రోజుల క్రితం పశ్చిమ దేశాలలో విజయకేతనం ఎగరవేసిన ఖాసిం అక్కడ కూడా ఈ నరమేధం సాగించాడు. ఆక్కడ కాలిఫెట్ అధికారాన్ని స్థాపించిన తరువాత ఉమ్మాయద్ ఆజ్ఞ మేరకు మరలా డమాస్కస్‌కి చేరుకున్నాడు.

ఒక పదవిలో ఒకే తరహా జీతానికి, సదుపాయాలకు పనిచేస్తున్నవారు, కొద్దికాలం తరువాత తమ హెూదాలో, సదుపాయాలలో పురోగతి కోరుకుంటారు. దీనికి సమాధానంగా వారి పైస్థాయి వారు తమ కార్యనిర్వాహణలో ఇబ్బందులను సాకులుగా చూపి వారికి అప్పటికే ఇస్తున్న సదుపాయాలలో పాక్షికంగా కోత విధిస్తారు. ఆ పరిస్థితులలో క్రింది స్థాయివారు తమ పదవిలో కొనసాగలేక, వదిలేయలేక అసంతృప్తితో ఉంటారు. అలా కొంతకాలం తరువాత, వారి విజ్ఞాపన మేరకు తిరిగి ఆ కోత విధించిన వాటిని పునరుద్ధరిస్తారు. ఆ విధంగా వారికి ఏమీ ఇవ్వకుండానే, వారిని సంతృప్తిపరిచిన వారు అవుతారు.

ఉమ్మాయద్ కూడా అదే చేశాడు. ఉమ్మాయద్ మాలేగనీమత్‌లో సంవత్సరం క్రితం కోత విధించాడు. బైతుల్‌మాల్‌ని రెండు వంతులకు పెంచాడు. ఏదైతే ఇస్లాం బలపడటానికి ఒక ముఖ్య కారణం అయిందో, అదే ఇప్పుడు వివాదాస్పదం అయింది. అప్పటినుండి సైనికులందరిలో అసంతృప్తి రగులుతోంది. వారు సైన్యం నుండి బయటకు వెళ్ళలేక, ఉండలేక సతమతమవుతున్నారు.

ఖాసిం వరుస విజయాలతో మహావీరుడిలా అరబ్‌లో పేరు గడించాడు. కాని ఎవరి వీరత్వం అయినా అతని వెనుక నడుస్తున్న సైన్యంలో ఐకమత్యం ఉంటేనే విజయం చేకూరుతుంది. ఈ బైతుల్‌మాల్ పెంచటం వలన సైన్యంలో తమ ఆదాయం తగ్గుతుందనే నిరాశ మొదలైంది. అది పశ్చిమదేశాల యుద్ధ సమయంలో బయటపడింది. అసలే వరుస యుద్ధాలతో విసుగెత్తిపోయిన సైన్యం తగ్గించిన ఆదాయానికి తమ నిరసనను బహిరంగంగానే వెళ్ళగక్కారు. యుద్ధ సమయంలో ఇలాంటి నిరసనలు ఖాసింకి కంటగింపుగా మారాయి. సైన్యం అసంతృప్తికి లోనై తిరుగుబాటు చేస్తే ప్రత్యక్షంగా దానికి బలయ్యేది తనే. ఉమ్మాయద్ డమాస్కస్ కదలకుండా తన ఇష్టం వచ్చిన నిర్ణయాలను

తీసుకొని తమను మాత్రం యుద్ధానికి ఉసిగొల్పుతున్నాడనుకున్నాడు. అందుకే ఈ విషయంలో ఖాసిం అమీతుమీ తెల్చుకోవాలనుకున్నాడు.

ఖాసిం సాధించిన విజయాన్ని అభినందించటంతో పాటు, సిల్క్ రహదారిలో అరేబియా వర్తకుల మీద వరుసగా జరుగుతున్న దాడుల మీద, తగ్గించిన "మాలేగనిమత్" గురించి చర్చించటానికి ఉమ్మాయద్ సమావేశం ఏర్పాటు చేశాడు. ఉమ్మాయద్ సమావేశ మందిరంలో ఉమ్మాయద్‌తో పాటు ఇతర సైనిక అధికారులు ఉన్నారు. ఉమ్మాయద్‌కి కార్యనిర్వహణ అంటే అది సైన్యంతో ముడిపడిన వ్యవహారం. ఈ కార్యనిర్వహణాధికారులు సాంప్రదాయ అరబ్ దుస్తులలో, నడుముకు వేలాడుతున్న భారీ ఖడ్గాలతో ఆశీనులై ఉన్నారు. అది సమావేశ మందిరమైనా యుద్ధభూమిలా ఉంది. అందరు అరక్ పానీయాన్ని సేవిస్తూ ఖాసిం రాక కోసం ఎదురు చూస్తున్నారు.

అరేబియా వర్తకుల మీద సిల్క్ రహదారిలో వరుసగా జరుగుతున్న దాడుల గురించి సమాచార సేకరణకు వేగును నియమించారు. ఆ వేగు తగిన సమాచారంతో ఉమ్మాయద్ సమావేశ మందిరం వెలుపల సిద్ధంగా ఉన్నాడు. ఖాసిం వచ్చే లోపు అతనిని లోపలికి రమ్మని చెప్పారు. దీనికంతటికీ కారణం కశ్యపాపురం సైనికులు అంటూ ఆ వేగు చెప్పటం మొదలుపెట్టాడు.

కశ్యపాపురం అనే రాజ్యం చంద్రభాగ నది ఒడ్డున ఉన్న అత్యంత సారవంతమైన ప్రాంతం. కశ్యపాపురం నగరంతో పాటు స్వయం సమృద్ధిని సాధించిన అనేక గ్రామాలు కలిసి ఒక సామ్రాజ్యంగా ఉంది. కశ్యపాపురాన్ని బంగారు నగరంగా పిలుస్తారు. ఇక్కడి దేవాలయాలలో అపారమైన బంగారం నిల్వలు ఉండటమే దీనికి కారణం. ఈ దేవాలయాలన్నిటిలోకి ప్రసిద్ధమైనది సూర్యదేవాలయం. ఈ రాజ్యం సిల్క్ రహదారికి సమీపంలో ఉంది. ఈ రాజ్యం మధ్యఆసియాను, దక్షిణాసియాను కలిపే ప్రాంతం కావడంతో ఇక్కడి మార్గం ద్వారా ఎంతోమంది యాత్రికులు, వ్యాపారస్తులు ప్రయాణిస్తుంటారు. వారు ఈ నగరంలోని దేవాలయాలను సందర్శించడం, కానుకలు సమర్పించడం అక్కడి సంపదకు మూలకారణం. అక్కడి పొలాలు కూడా సారవంతమైనవి కావడంతో అందులో బంగారం పండుతుంది అనడంలో అతిశయోక్తి లేదు. బ్రహ్మాండమైన భవనాలు, ఉద్యానవనాలతో నగర వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. కశ్యపాపురాన్ని చూస్తే నిజంగా దేవలోకంలో ఉన్నామనిపిస్తుంది. నిజానికి వారికి ఇలా సరుకులను దోపిడీ చేయాల్సిన అవసరం లేదు.

కశ్యపాపురాన్ని ప్రస్తుతం పరిపాలిస్తున్న రాజు పాళనరసింహుడు ఎంతో పరాక్రమ శాలిగాను, అక్కడి ప్రసిద్ధ వైదిక ధర్మానుసారం పరిపాలన చేసేవాడిగాను పేరుపొందాడు.

కశ్యపాపురం గొప్పతనం, రాజు మంచితనం గురించి వివరంగా చెప్పాడు ఆ వేగు.

ఇవన్నీ విన్న తరువాత "సిల్క్ రహదారిగుండా మన వ్యాపారం, మన మతం ఇతర ఆసియా ప్రాంతాలకు వెళ్లాలంటే మనం కశ్యపాపురాన్ని హస్తగతం చేసుకోవడం ఒక్కటే మార్గం" అన్నాడు ఉమ్మాయద్. ఈ మాట అక్కడి వారికి కొత్తగా ఏమీ అనిపించలేదు. అతను అప్పటికే పశ్చిమ దేశాలలో తన జైత్రయాత్ర విజయవంతమవ్వటంతో ఇంక తూర్పు దేశాలను హస్తగతం చేసుకొని ఇస్లామును విస్తరించాలనే పట్టుదలతో ఉన్నాడు. అందుకే సిల్క్ రహదారిలో దాడుల విషయాన్ని ఏకంగా రాజ్యాన్ని హస్తగతం చేసుకొనే యుద్ధంగా మార్చేశాడు.

వేగులు కశ్యపాపురం బలాలను చెప్పటం మొదలుపెట్టారు.

ఈ రాజ్యాన్ని కాపాడుతూ ఎత్తయిన, బలమైన కోటగోడ ఉంది. ఆ కోటగోడ గురించి ఎంత చెప్పుకున్నా తక్కువే. రెండు రథాలు పక్కపక్కనే ఆ గోడమీద ప్రయాణించ గలవు. ఇదే ఎన్నోరకాల దండయాత్రల నుండి రాజ్యాన్ని కాపాడింది. కశ్యపాపురం సైన్యం కూడా రథ, గజ, తుర పదాతిదళాలతో అత్యంత పటిష్టంగా ఉంది. దాదాపు పదిహేను వేలమంది సైన్యం రెండువేల ఆశ్విక దళాలు, రెండువందల వరకు రథ గజ దళాలతో ఎంతో పటిష్ఠంగా ఉంది. జగజ్జేత అలెగ్జాండర్‌కి విషపు బాణం రుచి చూపించిన ప్రాంతం ఇదే. ఆ తరువాతనే అతను భయంకరమైన రోగాల బారినపడి హింద్‌ని పూర్తిగా దక్కించుకోకుండానే మరణించాడు.

ఇవన్నీ వారికున్న బలాలు. వీటిని చూసే ఆ రాజ్యం మీద యుద్ధం అంటే చుట్టు ప్రక్కల రాజ్యాల వారు భయపడతారు. కాని ఆ రాజ్యాన్ని పట్టిపీడిస్తున్న బలహీనతలు కూడా ఉన్నాయి అని చెప్పటం మొదలు పెట్టేలోగా ఖాసిం సమావేశ మందిరంలోకి దూసుకొచ్చాడు. ఖాసిం రాకతో అక్కడి వాతావరణం కోలాహలంగా తయారైంది. కొందరు నిల్చొని సలాం చేశారు. మరికొందరు దగ్గరకు వెళ్ళి ఆప్యాయంగా హత్తుకొని తమ అభినందనలు తెలిపారు. పశ్చిమదేశాల మీద విజయంతో ఖాసిం పరపతి పెరిగింది. అతడిని వీరుడిగా గౌరవించేవాళ్ళు ఎక్కువయ్యారు. తనముందే కొందరు కార్యనిర్వహణ అధికారులు ఖాసింకు సలాం చేస్తుండటం ఉమ్మాయద్‌కి ఇబ్బందిగా అనిపించింది. అక్కడ జరుగుతున్న దానికి ఉమ్మాయద్ అసహనంగా ప్రేక్షక పాత్ర వహించాడు. అయోమయంగా చూస్తున్న వేగువైపు చూసి తరువాత కలవాలని బయటకు వెళ్లమని చేయి ఊపాడు. అతను అక్కడ నుండి నిష్క్రమించాడు. తరువాత కొద్దిసేపటికి గాని ఆ హడావిడి సద్దుమణగ లేదు. ఎవరి స్థానాలలో వారు ఆశీనులయ్యారు.

**ఇది కశ్యపాపురం గురించి ప్రస్తుతానికి వారికి తెలిసిన విషయం. ఇది మాత్రమే**

**తెలిసి ఉంటే వారు దాడికి తెగబడి ఉండేవారు కాదు. యుద్ధం చేయాలనుకునే వారు బలహీనతలు కూడా తెలుసుకుంటారు.**

ఖాసిం ఉమ్మాయద్ ఒకరికొకరు శుభాకాంక్షలు తెలుపుకున్నారు. ఖాసిం పశ్చిమ దేశాలలో తన జైత్రయాత్రకు సంబంధించిన విశేషాలను ఆనందంగా ఉమ్మాయద్‌కు వివరించాడు. తరువాత ఉమ్మాయద్ తనకిష్టం లేకపోయినా ఖాసింను పొగడ్తలతో ముంచేశాడు. "ఖాసింకు మాత్రమే ఈ పని సాధ్యమౌతుంది. ఇంకెవరి వల్లకాదు. ఖాసిం మహావీరుడు, అల్లాకు అత్యంత ప్రీతిపాత్రమైనవాడు" అంటూ పొగడ్తల పరంపర సాగింది. ఖాసింకు అవన్నీ చాలా వినసొంపుగా ఉన్నాయి. తన శ్రమకు తగిన గుర్తింపు దొరికినందుకు ఆనందంగా ఉంది. అప్పటివరకు తనకు శత్రువులుగా వ్యవహరించిన కార్యనిర్వహణాధికారులు తనను ఆప్యాయంగా అభినందించటం, ఉమ్మాయద్ తనని పొగడటం వలన ఖాసిం తనకు ఉన్న కోపాన్ని మర్చిపోయాడు.

తన శక్తి సామర్థ్యాలు ఎంత గొప్పవైనప్పటికీ వాటికి వచ్చే గుర్తింపు మరింత చోదకశక్తిగా పనిచేస్తుంది. అలాంటి గుర్తింపు చట్రంలో ఇరుక్కున్నవారికి అది ఒక వ్యసనంగా మారి మరింత గుర్తింపుకోసం ఎన్నో సాహసాలు, త్యాగాలు చేయటానికి సిద్ధపడతారు. కొన్నిసార్లు తమ ప్రాణాలను సైతం లెక్కచేయరు. ఇంతవరకు బాగానే ఉన్నా, కొంతమంది హితులని చెప్పుకునేవారు దానిని ఉపయోగించుకోవడానికి ప్రయత్నం చేస్తుంటారు. ఖాసిం విషయంలో కూడా అదే జరిగింది. ఖాసిం బలాఢ్యుడే అయినప్పటికీ అతనిని వీరుడిగా నిలబెట్టడం ఒక పథకం ప్రకారం జరిగింది. ఇప్పుడు ఆ చట్రంలో ఇరుక్కున్న ఖాసిం ఇంకా ప్రసంశలు పొందటానికి ప్రయత్నిస్తూ వారికి దాసోహం అయ్యాడు.

సిల్క్ రహదారిలో తరచూ జరుగుతున్న దాడులవైపుకు చర్చ మళ్ళింది. "తరచూ ఆ రహదారిలో అరేబియ సరుకులపై దాడులు జరుగుతున్నాయి. సరుకులను దోచుకెళ్ళటమే కాకుండా వర్తకులు, వారికి రక్షణగా వెళ్ళిన సైనికుల జాడ కూడా తెలియటంలేదు. దీని వెనుక కశ్యపాపురం సైనికుల ప్రమేయం ఉండొచ్చని ప్రాథమిక అంచనా. దానికి కారణం లేకపోలేదు. ఈ దాడులన్నీ కశ్యపాపురానికి చేరువలో జరగటమే కాకుండా, అత్యంత యుద్ధనైపుణ్యం గల మన సైనికులను ఎదుర్కొనే సత్తా తర్ఫీదు పొందిన సైనికులకే ఉంటుంది కాని, దారిదోపిడీలు చేసేవారికి ఉండదు. ఈ విషయాన్ని వేగులు కూడా ధృవీకరించారు. అంతేకాకుండా తూర్పు దేశాలలో కూడా రాజ్యన్ని విస్తరింపజేయాల్సిన అవసరం ఉంది. హింద్–చైనా ప్రాంతాలకు ముఖద్వారంగా ఉన్న కశ్యపాపురాన్ని జయించడం ద్వారానే అది సాధ్యమౌతుంది. కశ్యపాపురంలో పాగా వేస్తే మనం సిల్క్ రహదారి మీద పట్టుసాధించినట్లే. కాబట్టి వర్తకానికైనా, రాజ్యవిస్తరణకైనా ఆ ప్రాంతంలో

పాగా వేయడం ముఖ్యం. దీనిని జయించితే ఇతర హింద్ సామ్రాజ్యాలు బెంబేలెత్తుతాయి. వారంతట వారే మన కాలిఫెట్ అధికారానికి దాసోహమంటారు. ఇంక ఈ పనిని కూడా సమర్ధుడైన ఖాసింకి అప్పగించాలనుకుంటున్నాను" అన్నాడు ఉమ్మాయద్.

హింద్ మీద దాడికి ఉమ్మాయద్ సిద్ధమౌతాడని ఊహించాడు కానీ ఆ బాధ్యతలు కూడా తనకే అప్పగిస్తాడని ఖాసిం అనుకోలేదు. తాను పశ్చిమదేశాలను జయించి అధికారం స్థాపించగానే తనను వెనక్కి రమ్మని ఆదేశాలు వచ్చాయి. తీరా ఇక్కడికి వచ్చాక మరో బాధ్యత అప్పజెప్పారు. ఈ బాధ్యత వినగానే తన చేతిలోని అరక్ పానీయం ఉన్న పాత్రను ఆవేశంగా బల్ల మీద ఉంచి ఆలోచించసాగాడు. అది చేసిన శబ్దానికి అందరు ఖాసిం వైపు చూశారు. ఖాసిం ఆ పాత్ర వైపే చూస్తూ మౌనంగా ఉన్నాడు. అక్కడ ఉన్న వారికి అర్థమైంది, ఈ బాధ్యత ఖాసింకి ఇష్టం లేదని.

ఉమ్మాయద్ బహిరంగంగా ఒప్పుకోనప్పటికీ ఖాసిం యుద్ధనైపుణ్యం అతనికి తెలుసు. సర్వసైన్యాధికారి అయిన ఖాసిం చేస్తున్న వీరవిహారం వల్లనే తన అధికారం నిలబడుతుంది. ఈ విషయం అక్కడ కూర్చున్న చాలామందికి కూడా తెలుసు. ఖాసిం తన చేజారిపోకుండా తన కుయుక్తుల ద్వారా యుద్ధానికి ఉసిగొల్పాలనేది ఉమ్మాయద్ ఆలోచన.

ఖాసిం మౌనాన్ని గమనించిన ఉమ్మాయద్ "సంవత్సరం క్రితం పెంచిన 'బైతుల్‌మాల్' నిర్ణయం వెనక్కి తీసుకుంటున్నాం. ఇప్పటినుండి యుద్ధంలో గెలిచినప్పుడు ఐదింటా రెండు వంతుల ధనాన్ని కాకుండా ఒక వంతు అరేబియాకు పంపితే చాలు. ఖాసిం కూడా వరుస యుద్ధాలలో అలసిపోయాడు. కశ్యపాపురాన్ని జయించిన మీదట, ఖాసిం కశ్యపాపురంలోనే ఉండి రాజ్యపాలన చేస్తాడు. ఈ యుద్ధం తరువాత ఇంక ఏ యుద్ధానికి ఖాసింని పురమాయించనని హామీ ఇస్తున్నాను" ఆన్నాడు. కానీ ఖాసింకు తెలుసు కశ్యపాపురం కైవశం చేసుకునేదే హింద్‌లోని ఇతర ప్రాంతాలకు విస్తరించాలని.

ఇక్కడ అందరిదీ ఒక అనివార్యమైన పరిస్థితి. ఉమ్మాయద్ తాను ముస్లిం ప్రపంచాన్ని నడిపించే నాయకుడిగా నిరూపించుకోవాలనే తపన. ఏ మాత్రం ఆ బాధ్యత విస్మరించినా అరేబియా మీద తన పట్టు సడలుతుంది. అందుకే ఏదో ఒక యుద్ధమని చెప్పి అందరినీ తనవైపు తిప్పుకుంటాడు. ఖాసింకు కూడా వేరేదిక్కు లేదు. తాను ఇప్పుడు ఉన్న సర్వసేనాపతి స్థాయిని అతికష్టం మీద చేరాడు. ఇప్పుడు యుద్ధం చేయనని వెనుకంజ వేస్తే దాదాపు పదిహేనేళ్ళు కష్టపడి నిర్మించుకున్న ఆ హోదాను వదులుకోవడమే. ఆ పదవినుండి తప్పుకోవలసి ఉంటుంది. అంతేకాక ముస్లిం ప్రపంచంలో పట్టుకోసం ఉమ్మాయద్ తనమీద ఏదో ఒక అభియోగం మోపి తనను సంహరిస్తాడు. తాను స్వతహాగా వీరుడైనప్పటికీ ఉమ్మాయద్ తన అంగబలం, తెలివితేటలతో తనను అంతం చేయగల

సమర్థుడు. తన మాటను ధిక్కరించిన వారి కుటుంబాలను కూడా నాశనం చేస్తాడని తనకు తెలుసు. ఇంతకు ముందు ఇలా జరిగిన సంఘటనలు లేకపోలేదు.

ఉమ్మాయద్ ఎవరినీ నమ్మడు. ఖాసిం యుద్ధభూమిలో ఉన్నప్పుడు తన చుట్టూ ఉండే సైనిక అధికారులలో నలుగురికి తన అంగీకార పత్రాలు ఇస్తాడు. ఏ క్షణంలో అయినా ఖాసిం తన ఆజ్ఞలను ధిక్కరిస్తే ఖాసింను బంధించి కానీ, చంపి కానీ సైన్యాన్ని తన ఆజ్ఞలకు అనుగుణంగా నడపాలనే ఈ అధికార పత్రాలు. ఒక సాధారణ సైనికుడిగా ఉన్నప్పుడు ఖాసిం కూడా ఇలాంటి పత్రాలు పట్టుకు తిరిగాడు. ఇంకా తెలివిగా ఖాసిం అనే పేరుతో ఉన్న ఇంకొక నలుగురు సైనికులను కూడా ప్రచారంలోకి తెచ్చాడు. ప్రజలకు అసలు ఖాసిం ఎవరనేది తెలియకుండా తెలివిగా ప్రవర్తించేవాడు. కాబట్టి తను చనిపోయినా ఉమ్మాయద్‌కి కావలసిన ఖాసిం బ్రతికే ఉంటాడు.

ఇంకేముంది తన అసమ్మతి తెలపడం తెలివితక్కువ విషయం కనుక ఈ యుద్ధం చేసే అవకాశం ఇచ్చినందుకు ఉమ్మాయద్‌కి కృతజ్ఞతలు చెబుతూ ఉమ్మాయద్ ఖ్యాతిని పొగిడాడు ఖాసిం. ఉమ్మాయద్ మాట నిలబెట్టుకుంటే ఈ అవకాశం కూడ బాగానే ఉందనుకున్న ఖాసిం ఒక్క గుక్కలో అరక్ పానీయాన్నీ ముగించి తాను ఈ యుద్ధానికి సిద్ధం అన్నట్లు తన కుడి చేయి పిడికిలిని గాలిలోకి లేపాడు. ఆ హింద్ ప్రజలకు కాలిఫేట్ రాజ్యాన్ని పరిచయంచేస్తానని ఖాసిం తెచ్చిపెట్టుకున్న గాంభీర్యాన్ని ప్రదర్శించాడు. అక్కడ సమావేశమైన అందరూ అదే విధంగా తమ చేతులను గాలిలోకి లేపి ఉమ్మాయద్‌కు తమ అభినందనలు తెలియజేశారు.

ఉమ్మాయద్ తను అప్పటికే సిద్ధం చేసుకున్న ప్రజా ఆజ్ఞాపన పత్రాన్ని బయటకు తీశాడు. దానితో అక్కడి వారికి అర్థమైంది. ఈ యుద్ధం గురించి ఉమ్మాయద్ ముందే నిర్ణయం తీసుకున్నాడని, వర్తకుల మీద దాడి కేవలం సాకు మాత్రమేనని. ఆ ఆజ్ఞాపన పత్రాన్ని వారికి చదివి వినిపించాడు.

“దేవుడి రాజ్య స్థాపనలో అమరులైనవారు అల్లాకు అత్యంత ప్రీతిపాత్రులు. వారి కోసం పరలోకంలో సుఖాలు సిద్ధంగా ఉంటాయి. ఈ పవిత్ర యుద్ధంలో యువకులందరూ పాలుపంచుకోవాలి. ఇస్లాంకు వ్యతిరేకమైన అవిశ్వాసులెవ్వరు ఈ భూమి మీద లేకుండా చూడాలి. ఇది అల్లా ఆజ్ఞ. మన కర్తవ్యం వారిని ఇస్లాంలోకి మార్చాలి లేదా వారిని నిర్మూలించాలి. ఈ పవిత్రకార్యంలో మనం చాలావరకు విజయం సాధించాం. మనం ఈ కార్యాన్ని పూర్తి చేయటానికి హింద్ మీద యుద్ధాన్ని ప్రకటిస్తున్నాం.” యుద్ధ ప్రకటనతో పాటు అవిశ్వాసుల మీద యుద్ధంలో విజయం సాధించటానికి మసీదులో ప్రార్థనలు చేయాలని పిలుపునిచ్చాడు. పనిలో పనిగా పన్నులు కూడా పెంచుతూ ఉత్తర్వులు జారీ

చేశాడు ఉమ్మాయద్. సమావేశం ముగిసిందని, కశ్యపాపురం గురించిన పూర్తి వివరాలతో తదుపరి సమావేశమవుదామని చెప్పాడు.

బయటకు వస్తున్న ఖాసిం మనసు నిండా తన కుటుంబానికి సంబంధించిన ఆలోచనలే సుడులు తిరుగుతున్నాయి. గడచిన యుద్ధం తరువాతైనా తన ఇద్దరి భార్యలతో కులాసాగా గడపవచ్చుననే ఆనందంలో ఉన్నాడు. వరుస యుద్ధాలతో పిల్లల్ని దగ్గరుండి చూసుకోవాలనే అతని కోరిక ఇప్పటి వరకు నెరవేర లేదు. ఖాసిం అడుగుపెట్టిన చోటల్లా తనకు కొంతమంది స్త్రీలతో సాంగత్యం ఏర్పడినప్పటికీ వారిమీద ఆలోచన అక్కడ ఉన్నంత కాలమే ఉండేది. కానీ తన ఇద్దరు భార్యలన్నా, పిల్లలన్నా ప్రేమ ఉండేది. వారితో సంతోషంగా కాలం గడపటమే తనకు అంతిమ ఆనందమని అనిపించేది.

ఖాసింకి తన చిన్న భార్య అన్నా, ఆమె కొడుకన్నా చాలా ఇష్టం. వాడిది ఎంతో చక్కనైన రూపం. యుద్ధంలో విశ్రాంతి దొరికినపుడు వాడి రూపం, వాడి మాటలు గుర్తొస్తూండేవి. తన కొడుకులు వర్తకంలో రాణించాలని తన కోరిక. వారిని మాత్రం సైనికులుగా చేయకూడదని తనెప్పుడూ అనుకుంటుంటాడు. తన పిల్లలు బాల్యంలో చేసే అందమైన చేష్టలను చూస్తూ ఆనందంగా గడపలేకపోతున్నందుకు బాధపడేవాడు.

ఉమ్మాయద్ తెలివిగా తనని మళ్ళీ ఇరికించాడు. మాలేగనిమత్ పెంచటంతో సైనికుల అసంతృప్తి సాకుగా యుద్ధం తప్పించుకోవటం కూడా కుదరదు. మళ్ళీ హింద్ నుండి తిరిగిరాగలనో లేదో అని మథనపడుతూ, తన కుటుంబం నుండి దూరమౌతున్నందుకు గుండె నిండా బాధతో బయటకొచ్చాడు.

ప్రపంచ చరిత్రలో ఎంతో క్రూరులైన నియంతలుగా పేరు తెచ్చుకున్నవాళ్ళు కూడా నిజజీవితంలో ప్రేమకు బందీలే.

## 3

**క**శ్యపాపురం ప్రపంచంలోని అత్యంత పురాతన నగారాలలో ఒకటిగా ప్రసిద్ధి గాంచింది. మహాభారత కాలంలో ఇది త్రిగర్త సామ్రాజ్యానికి రాజధాని నగరం. మహాముని కశ్యపుని పేరు మీదగా ఇది కశ్యపాపురం అని పిలవబడుతున్నది. మహాభారత కాలం నుండి ఇక్కడ నాగరికత వెల్లివిరిసింది. ముందు దీనిని కాష్టపపురంగా, తరువాత కాలంలో కశ్యపాపురంగా పిలుస్తున్నారు. ఇక్కడ ప్రతిష్టాత్మక సూర్య దేవాలయమే కాదు, స్వయంగా ప్రహ్లాదుడే నిర్మించాడని చెప్పబడే ఉగ్రనరసింహుడి ఆలయం కూడా ఉంది. సూర్య దేవాలయానికి దగ్గరలో ఉండే సూర్య తటాకం మానవ నిర్మిత తటాకాలలో అతి పురాతనమైనది. ప్రస్తుతానికి కశ్యపాపురానికి రాజు పాళనరసింహుడు. అత్యంత

జనరంజకమైన పాలన అందిస్తున్నా, **సమాజంలో అంతర్లీనంగా నడుస్తున్న ఒక దారుణాన్ని మాత్రం చూసీచూడనట్లు వదిలేస్తున్నాడని ఆ దారుణానికి బలయ్యేవారి ఆరోపణ.**

పాళనరసింహుడు అధికారంలోకి వచ్చిన తరువాత ఇప్పటివరకు ఎటువంటి యుద్ధాలు జరుగలేదు. చాలా విచిత్రంగా తన పదవీకాలాన్ని ముగించి యువరాజుకు పట్టాభిషేకం చేసే సమయంలోనే రాజ్యం మీద యుద్ధ మేఘాలు కమ్ముకున్నాయి. నిజమేదైనప్పటికీ సిల్క్ రహదారిలో అరేబియా వర్తకుల మీద కశ్యపాపురం సైనికులు వరుసగా దోపిడీలు చేస్తున్నారనే సాకుతో ఉమ్మాయద్ యుద్ధాన్ని ప్రకటించాడు. అరేబియాతో సాగించిన రాయబారం కూడా విఫలమైంది. అరేబియా వారి దృష్టిలో యుద్ధ నిర్ణయం జరిగిపోయింది. దానికి సన్నాహాలు కూడా మొదలుపెట్టారు. యుద్ధ వ్యూహంలో భాగంగా కశ్యపాపురం బలహీనతలను వారి బలంగా మార్చుకునే పనిలో ఉన్నారు.

కశ్యపాపురంపై యుద్ధాన్ని ప్రకటించారన్న వార్తలు రాజ్యమంతా దావానలంలా వ్యాపించాయి. అరేబియా నుండి వస్తున్న వర్తకులు సరుకులతో పాటు ఈ సమాచారాన్ని కూడా మోసుకొచ్చారు. ఏ విషయమైనా అది అవసరమైన వారి కన్నా అవసరం లేని వారికి ముందు తెలుస్తుంది. ఈ విషయం తెలిసిన ప్రజలు భయభ్రాంతులకు గురయ్యారు.

వారు మంగోలియా బాణాలు ఉపయోగిస్తారని, అవి మనవారు ఉపయోగించే బాణాల కన్నా మూడు రెట్లు ఎక్కువ దూరం వెళ్తాయని, వారి ఫిరంగులు ఒక్క క్షణంలో మన కోట గోడను కూల్చేస్తాయని, ఇలా జరగబోయే దాని గురించి కథలు కథలుగా చెప్పుకుంటూ భయంతో రోజులు లెక్కబెట్టుకుంటున్నారు ప్రజలు. అన్నింటికన్నా ముఖ్యంగా ఖాసిం క్రూరత్వం గురించి, అతను చేసిన హింసాకాండ గురించి తెలుసుకొని నిద్రలేని రాత్రులు  గడుపుతున్నారు.

రాజు పరివారం గాంభీర్యాన్ని ప్రదర్శిస్తూ రాయబారం నడిపి యుద్ధాన్ని నివారించాలనుకున్నారు కాని ఆ రాయబారం విఫలమయింది. ప్రజలలో ఉన్న భయాందోళనలను పోగొట్టటానికి ఈ విషయాన్ని చర్చించి ఒక ప్రకటన చేయాలనుకున్నారు. అందుకే రాజు  అతని పరివారం సమావేశమయ్యారు.

సమావేశంలో ముందుగా అందరిలోకి పెద్దవారైన రాజ జ్యోతిష్యుడు శంకర ఆచార్యుల వారు లేచి “శత్రుదుర్భేధ్యమైన కోట గోడ, లెక్కకు మించిన సుశిక్షితులైన సైనికులుండగా మనం యుద్ధం గురించి భయపడాల్సిన అనసరం ఏముంది. మనకు గ్రహాలు, శకునాలు అన్నీ అనుకూలంగా ఉన్నాయి. ఈ సమయంలో మీరొక గొప్ప విజయాన్ని సాధించబోతున్నారని స్పష్టంగా చెబుతున్నాయి. ఎంతో ఘనత వహించిన మీ పూర్వీకులు

ఎన్నో విదేశీ దండయాత్రలను ధైర్యంగా ఎదుర్కొని వారిని తరిమికొట్టారు. అలెగ్జాండర్ అతని సేనాని సెల్యుకస్‌లు సైతం మన సామ్రాజ్యాన్ని తాకలేకపోయారు. ఇంచుమించుగా వారు దండయాత్ర చేసినప్పుడు ఉన్న శకునాలే ఇప్పుడూ ఉన్నాయి. ఇంకా చెప్పాలంటే అలాంటి చరిత్ర సృష్టించే అవకాశం మీకు వచ్చిందనుకోవాలి. మీరు వేదాలను, బ్రాహ్మణులను గౌరవిస్తారు. మా ఆశీస్సులు, ఆ ఆదిత్యుని ఆశీస్సులు మీకు ఎప్పుడూ ఉంటాయి. కనుక మీకు అపజయం ఉండదు. విజయోస్తు" అని దీవించి కూర్చున్నాడు.

ఇంతలో రాజగురువు కల్పించుకొని కోపంగా "జరుగబోయేది అంత స్పష్టంగా కనబడుతుంటే విజయం సిద్ధిస్తుందని ఎలా చెప్పగలరు. జ్యోతిష్యం జరుగబోయేది చెబుతుందంటారు. చెప్పి ఏమిటి లాభం? దానిని జరగకుండా ఆపలేం కదా. మనం ఏదైనా ప్రయత్నం చేసి జరగకుండా ఆపగలిగితే, చెప్పింది చెప్పినట్లుగా జరగనట్లే కదా. అంటే జ్యోతిష్యం విఫలమైనట్లే. ఏ విధంగా చూసినా జ్యోతిష్యంతో ఎటువంటి ఉపయోగం లేదు. ఇలాంటి మూఢనమ్మకాలతోనే రాజ్యాన్ని, రాజుని ఈ స్థాయికి దిగజార్చారు. నూటికో కోటికో ఒకసారి నిజమయ్యే మీ మాటలను విశ్వసించడానికి ఇక్కడ ఎవరూ సిద్ధంగా లేరు. ఈ వ్యవహారానికి కారకులు మనమధ్యనే ఉన్నారు. ఉమ్మాయద్ దృష్టిలో ఈ కశ్యపాపురం మీద యుద్ధం అనే అంశం అసలు లేనేలేదు. మన సైనిక అధికారుల స్వార్థంతో వారి పతాలంలోని సైనికుల చేత సిల్క్ రహదారులలో జరిగే వ్యాపార రాకపోకల మీద దాడి చేయించి సరుకులను, ధనాన్ని దోచేశారు. దీనిని సాకుగా మొత్తంగా మన రాజ్యం మీదనే దండయాత్రను ప్రకటించారు.

ఈలోగా పశ్చిమదేశాల మీద దండయాత్రను విజయవంతంగా ముగించుకొని ఖాసిం వచ్చాడు. అగ్నికి వాయువు తోడైనట్లు ఉమ్మాయద్‌కు ఖాసిం దొరికాడు. ఇప్పుడు వాళ్ళను నిలువరించటం అంత సులువైన విషయం కాదు. అప్పటికీ మన రాయబారులు రాజీ ప్రయత్నాలు చేశారు. వ్యాపార సంబంధాలు నెలకొల్పడంతోపాటు సిల్క్ రహదారిలో ప్రయాణానికి తగిన రక్షణ కల్పిస్తామని హామీ ఇచ్చాం కానీ పశ్చిమ దేశాలలో ఇస్లాం విస్తరణ పని విజయవంతంగా ముగియడంతో ఇక తూర్పు దేశాలపైన దృష్టిని కేంద్రీకరించా లనే యోచనలో కూడా వాళ్ళు ఉన్నట్లున్నారు. దానికి ఈ సిల్క్ రహదారిమీద దాడిని ఒక సాకుగా వెతుక్కున్నారు" అన్నాడు.

సర్వసేనాపతి లేచి "రాజుగా పాళనరసింహుడు అధికారంలోకి వచ్చిన తరువాత మన సైన్యం పాల్గొన్న యుద్ధాలేమీ లేవు. ఈ తరం సైనికులకు కదనరంగంలో దాదాపుగా అనుభవం లేనట్లే. వారికి అంతర్గత భద్రత విషయంలో మాత్రమే అనుభవం ఉంది. కొంతలో కొంత యుద్ధనైపుణ్యం ఉన్న సరిహద్దు రక్షణ చూసేవారికి, వారి పైస్థాయి

అధికారులకీ మధ్య విభేదాలు తారాస్థాయికి చేరాయి. మనవారిలో ఉన్న ఐకమత్యం చూస్తే కోటగోడను బయటనుండి ఫిరంగులతో బద్ధలు చేయాల్సిన అవసరం లేదు. వీరే దానిని కూల్చి శత్రు సైనికులను ఆహ్వానించేటట్లు ఉన్నారు. ఏదో ఒకటి చేసి అందరూ ఐకమత్యంతో యుద్ధానికి సిద్ధమైనా మన వారి అనుభవలేమితో మనం ఓటమి చెందవచ్చు. ఈ పరిస్థితులలో మన సహచర రాజ్యాలనుండి సైనిక సాయం కోసం ప్రయత్నించవచ్చు. ఈ భూభాగం మీద జరగబోతున్న విదేశీ దండయాత్ర అనే కారణాన్ని చూపి మనం మిత్రరాజ్యాలతో కూటమి కోసం ప్రయత్నిద్దాం" అన్నాడు.

దానికి రాజగురువు "మనం ఆ విధంగా కూడా ప్రయత్నించాం. కానీ వారి నుండి ఆశాజనకమైన హామీ ఏదీ రాలేదు. ఖాసిం సేనలతో యుద్ధమే దానికి కారణం. వారి ఉద్దేశంలో సిల్క్ రహదారిని ఆధీనంలోకి తెచ్చుకోవటానికి కశ్యపాపురం చాలా వ్యూహాత్మకమైన ప్రాంతం. వారు దానిని ఆక్రమించుకోవడంతో సరిపెడతారు. ఇంక తమ జోలికి రారు అని వారి ధైర్యం. అనవసరంగా యుద్ధంలో భాగస్వాములు అయితే గెలుపు సంగతి ఎలా ఉన్నా వాళ్ళ రాజ్యాలు కూడా కోల్పోతామని వెనుకంజ వేస్తున్నారు. కాని వారి వ్యూహం సిల్క్ రహదారి కోసం కాదని, దీనిని ఆక్రమించిన తరువాత ఇక్కడి ఇతర రాజ్యాలను వశపరచుకోవటమే వారి తదుపరి లక్ష్యమని అర్థం చేసుకోవట్లేదు.

రాజు వీరి చర్చను గమనిస్తున్నప్పటికీ తన ఆలోచనంతా, తాము ఇప్పటివరకు రాజ్యపాలనలో చేసిన తప్పులమీదే ఉంది. తమకు ఉన్న ధర్మశాస్త్రాలు, రాజ్యాంగ యంత్రాంగం ఒకరి స్వేచ్ఛ ఇంకొకరి స్వేచ్ఛకు ప్రతిబంధకం కాకుండా చూడాలి. అక్కడే రాజుగా తాను విఫలమయ్యాడు. అదే సరిహద్దు సైనికులకు ఇతరులకు మధ్య పూరింపలేని అగాధాన్ని సృష్టించింది. ధర్మం, న్యాయం, శిక్ష ఒక్కొక్కరికి ఒక్కో విధంగా ఉంటే సమిష్టిగా పోరాడాల్సి వచ్చినప్పుడు వారు సహకరించరు. దానికి వారిని నిందించడం కూడా సరికాదు. వీటిని సరిదిద్దే అవకాశం ఉన్న సమయంలో తాత్సారంచేసి ఇప్పుడు త్వరపడినా లాభంలేదు. ఈ విషయంలో తాను విఫలమైనందుకు మనసంతా దుఃఖమలముకుంది.

సమావేశమైన వారందరు రాజు అభిప్రాయం కోసం వేచిచూస్తున్నారు. సభలో కొద్దిసేపు నిశ్శబ్దం చోటుచేసుకుంది. అప్పుడు పాళనరసింహుడు తన ఆలోచనలనుండి బయటకు వచ్చి మాట్లడటం మొదలుపెట్టాడు "మన సహచర రాజ్యాలతో స్నేహ సంబంధాల మూలంగా అయితేనేమీ ఈ ప్రాంతంలోనే అతి పెద్ద సామ్రాజ్యం అవటం వలన మన సైనిక బలగం మీద మనకన్నా ఇతరులకున్న విశ్వాసం మూలంగా అయితేనేమీ మన రాజ్యంలో ఒక తరం సైనికులు యుద్ధానికి దూరంగా ఉన్నారు. ఎంతో యుద్ధ నైపుణ్యం ఉన్న సరిహద్దు సైనికులు రాజ్యంలో జరుగుతున్న వరుస సంఘటనలతో,

యుద్ధ సమయంలో వారు ఏ నిర్ణయం తీసుకుంటారో అర్థంకావటం లేదు.

కాని మనం ఇప్పుడు చాలా అపాయకర పరిస్థితులలో ఉన్నాం. యుద్ధానికి రాబోతుంది ఖాసిం సేనలు. యుద్ధమే ఊపిరిగా బ్రతికే వారు తమ అధికారాన్ని ఇప్పటికే ప్రపంచంలో చాలా భాగానికి విస్తరించారు. ఇప్పుడు వారి దృష్టి మన దేశం మీద పడింది. దేవతలు, పుణ్యపురుషులు నడయాడిన దేశమని మన కశ్యపాపురానికి పేరు. మన దేశానికి ప్రకృతి సంపదనే కాదు, రక్షణను కూడా ఇచ్చింది. భూతల మార్గం ద్వారా ఈ దేశాన్ని జయించాలనుకున్న వారందరు ఇప్పటివరకు విఫలమవ్వటమే కాకుండా వారి ప్రాణాలను కూడా కోల్పోయారు. ఈ ప్రకృతి ఒడిదుడుకులను తట్టుకుని అతి కష్టం మీద మన సరిహద్దులకు చేరేసరికి ఖాసిం సైన్యం శక్తి హీనమవుతుంది. ఆ సమయంలో మనమందరం ఐకమత్యంతో ఒక వ్యూహం ప్రకారం పోరాడితే విజయం సాధించే అవకాశాలు ఉన్నాయి. మనం నిరాశ చెందనవసరం లేదు.

నేను మీ ద్వారా మన ప్రజలందరికీ తెలియజేసేదొకటే “ఇప్పటి వరకు ప్రశాంతంగా జీవిస్తూ, స్వేచ్ఛతో సకల సౌఖ్యాలు అనుభవించిన వారైనా, బాధలతో తమకు అన్యాయం జరిగిందనుకునే వారైనా మనం మన దేశభక్తిని నిరూపించుకునే అవసరం, అవకాశం వచ్చింది. అందరం కలిసి సమిష్టిగా సోదర భావంతో పోరాడి ఈ గండాన్ని గట్టెక్కించగలిగితే భవిష్యత్‌లో యువరాజు విజయనరసింహుడి నేతృత్వంలో కశ్యపాపురం బంగారు దేశమౌతుంది. మీరు రామరాజ్యాన్ని చూస్తారు. ఆ ఆదిత్యదేవుడు, ఉగ్రనరసింహుడి ఆశీస్సులు కూడా మనకు రక్షగా ఉన్నాయి. దేశాన్ని ప్రాణంకన్నా మిన్నగా ప్రేమించి, రక్షించే సైన్యం ఆధ్వర్యంలో మనం తప్పక విజయం సాధిస్తాం. శత్రు సైనికులు ఏ క్షణంలో విరుచుకుపడినా మన సైన్యం వారిని ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉంది” అనే ప్రకటనను వాడవాడలా చాటింపువేయాలని దానితోపాటు యుద్ధం ముగిసే వరకైనా అధికారులను సైనికులతో జాగ్రత్తగా మసులుకోమని చెప్పాడు. సుహృద్భావ వాతావరణం కల్పించటానికి అధికారులను వారి వారి పతాలం సైనికులతో విందు ఏర్పాటు చేయాలని, దానికి కావలసిన నిధులను విడుదల చేయవలసినదిగా ఆదేశాలు జారీచేశారు. మరీ అత్యవసరమైతే కాని పన్నులు పెంచవద్దని కూడా చెప్పారు. సమావేశం ముగిసేసరికి అక్కడ సమావేశమైన వారికి కొంత ధైర్యాన్నివ్వటంలో రాజు సఫలీకృతుడయ్యాడు. వారంతా సమావేశ మందిరం నుండి నిష్క్రమించారు.

పాళనరసింహుడు మాత్రం దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. అప్పుడు కపిలదత్తు “మహారాజా! మన నిర్లిప్తతతో, మన పూర్వీకుల నిర్లిప్తతతో మన దేశానికి జరగవలసిన నష్టం ఏనాడో జరిగిపోయింది. ఇప్పుడు విచారించి లాభం లేదు. మనం వాస్తవాన్ని అంగీకరించాలి. శత్రువు బలవంతుడనే దానికన్నా, మనలో ఐకమత్యంలేక మనం

బలహీనులుగా ఉన్నామనేది సత్యం. కశ్యపాపురం భవిష్యత్ గురించి బాగా ఆలోచించిన తరువాత నాకొక ఆలోచన వచ్చింది. ప్రస్తుత యుద్ధంలో గెలుపు ఓటములు యువరాజు ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనే దానిమీద ఆధారపడి లేవు. కాబట్టి యువరాజు పట్టాభిషేకాన్ని వాయిదా వేద్దాం. ఈ యుద్ధంలో ప్రస్తుత సమీకరణాలనుబట్టి ఇరువురి అవకాశాలు సమానం. మనల్ని దురదృష్టం వెంటాడితే ప్రస్తుతం మనం బలంగా భావిస్తున్న వారు కూడా యుద్ధ సమయంలో మనల్ని మోసం చేయవచ్చు. అప్పుడు అపజయం పొందక తప్పదు. ఓటమిపాలు అయిన తరువాత ఇక్కడ ఖాసిం నేతృత్వంలో పాలన మొదలౌతుంది. వీరు రాజ్యాలను కైవసం చేసుకొని వారి పాలన స్థాపించిన ప్రతిచోట ప్రజలు చిత్రహింసలు అనుభవిస్తున్నారు. అది ఇక్కడ కూడా పునరావృతమవటం తథ్యం. అప్పటికైనా మన ప్రజలకు స్వపరిపాలన, ఐకమత్యం యొక్క అవసరం తెలుస్తుంది. అప్పుడు మన దేశ ప్రజలను బాధలనుండి విముక్తి చేయాలంటే వారందరినీ సంఘటిత పరచి, పోరాటంతో స్వపరిపాలన పునరుద్ధరించుకోవాల్సి ఉంటుంది. దానికి సరైన నాయకుడు యువరాజు విజయనరసింహుడని నా అభిప్రాయం. కాబట్టి .... అని కపిలదత్తు మౌనంగా ఉండిపోయాడు.

అప్పటివరకు నేలను చూస్తూ ఆలకిస్తున్న రాజు ఒక్కసారిగా కపిలదత్తు వైపు చూశాడు.

కాబట్టి విజయనరసింహుడిని ఎక్కడికైనా ప్రవాసం పంపించటం మంచిది అని కపిలదత్తు ముగించాడు.

పాళనరసింహుడు కళ్ళు మూసుకుని కొద్దిసేపు ఆలోచించాడు.

"విజయనరసింహుడిని రక్షణ కోసం ఎక్కడికైనా పంపామని తెలిస్తే, అసలే ఐకమత్యం లేని మన సైన్యంలో అలజడి రేగే ప్రమాదం ఉంది. ఇది సైనికుల మానసిక స్థైర్యాన్ని దెబ్బతీస్తుంది" అన్నాడు పాళనరసింహుడు.

"అందుకే యుద్ధం మొదలయ్యే వరకు యువరాజును రాజ్యంలోనే ఉంచి, యుద్ధం మొదలైన వెంటనే అత్యంత రహస్యంగా నమ్మకమైన వారిచేత సురక్షిత ప్రదేశానికి పంపిద్దాం. ఇంక ఈ విషయంలో మనం ఏ అనుమానాలు పెట్టుకోకుండా, యువరాజును ఎవరి ద్వారా ఎక్కడికి పంపిస్తే మంచిదో ఆలోచిద్దాం మహారాజా!" అన్నాడు కపిలదత్తు.

"యువరాజు, నరేంద్రదత్తు ప్రాణస్నేహితులు. వారు ఒకరిని విడిచి ఒకరు ఉండ లేరు. అంతేగాక భవిష్యత్ రాజ్యపాలనకి యువరాజు అవసరం ఎంత ఉందో నరేంద్రుని అవసరం కూడా అంతే ఉంది. అందుకే నరేంద్రుడిని రక్షించుకోవాల్సిన బాధ్యత కూడా ఉంది. అత్యంత క్లిష్టమైన సమయాలలో మనలాగే వారిద్దరు ఒకరికి ఒకరు చేదోడు

వాదోడుగా ఉంటారు. కాబట్టి మనం వారిద్దరిని ప్రవాసం పంపుదాం. ఇంక ఈ బాధ్యతను నిర్వహించగలిగినది మన ఆంతరంగిక సైనికులు మాత్రం కాదు, సంస్కరణాభిలాషి అయిన విజయనరసింహుడంటే వారికి గిట్టదు. అంతఃపుర రాజకీయాలతో సంబంధంలేని నమ్మకమైన, యుద్ధ విద్యలలో నిపుణుడైన వ్యక్తి మనకు కావాలి. అంతేకాకుండా వీరిద్దరి గుర్తింపును బయటపెట్టకుండా తమలో మనిషిగా చూస్తూ రక్షణ కల్పించగలిగే నమ్మకమైన వారి వద్దకు మాత్రమే పంపించాలి" అన్నాడు పాళనరసింహుడు.

దానితో అలాంటి సురక్షితమైన ప్రదేశం గురించిన చర్చ మొదలైంది.

రాకుమారుని హోదాకు తగ్గట్టు ఇతర రాజ్యాలకు అతిథిగా రక్షణ కోసం పంపుదామనుకున్నాడు. కానీ వారందరూ ఖాసిం అంటే భయపడుతున్నారు. విధేయతను నిరూపించుకోవటానికి అతనికి అప్పచెప్పినా ఆశ్చర్యపోవలసిన అవసరం లేదు.

తరువాత రాజ్యానికి దగ్గరగా ఉండే బౌద్ధారామాలను కూడా అనుకున్నారు. కాని రాజు వైదిక ధర్మానికి ప్రాధాన్యత ఇస్తూ వచ్చాడు. దానివలన బౌద్ధ ఆరామాల్లో భిక్షువుల విలాసాలకు ధనం అందటం లేదు. వారు బహిరంగంగా తమ అసంతృప్తి వెళ్ళగక్కనప్పటికీ, సకల దారుణాలకు ఆరామాలు నెలవులు అవటం వలన, ధనంకోసం ఖచ్చితంగా వారు యువరాజుకు హాని తలపెడతారు.

తమకు అందుబాటులో ఉన్న అనేక అవకాశాలను మథించిన మీదట రాజు, రాజ గురువు ఒక నిర్ణయానికి వచ్చి తదుపరి కార్యాచరణకు సమాయత్తమయ్యారు.

## 4

**పా**ళనరసింహుడి వంశం ఎన్నో తరాలుగా కశ్యపాపురాన్ని పరిపాలిస్తోంది. వీరి పూర్వీకులలో కొందరు బౌద్ధాన్ని ఆదరించినప్పటికీ తరువాతి కాలంలో మళ్ళీ వైదిక ధర్మానికి విధేయులుగా మారారు. ఉగ్రనరసింహుడి భక్తులుగా తమ వంశంలో నరసింహుడి పేరును ఆనవాయితీగా చేర్చుకుంటున్నారు. ఈ వంశ పరంపరలో రాజులందరు వైదిక ధర్మానుసారం పరిపాలన సాగిస్తున్నారని, అందుకే ఈ రాజ్యానికి దేవతల ఆశీస్సులు ఉన్నాయని, ఆ ఆశీస్సులు ఉండబట్టే రాజ్యం సిరి సంపదలతో తులతూగుతూ ప్రజలందరు సంతోషంగా ఉన్నారని, ఆ సంతోషంగా ఉన్నవారు రాజును, రాజవంశాన్ని కీర్తిస్తూ పనికట్టుకొని ప్రచారం చేస్తుంటారు. వారు రాజును ప్రత్యక్షదైవంగా కొనియాడే సంస్కృతిని అలవాటు చేశారు. కొంతమంది తమ పూర్తి సమయాన్ని ఈ పనికే కేటాయించి రాజు యొక్క గుణగణాలను కీర్తిస్తూ కథలు, కావ్యాలు రాసి ప్రాచుర్యంలోకి తెచ్చారు. **కానీ రాజు కీర్తి మసకబారిపోయే పనులు కూడా వారే చేశారు.**

రాజగురువు కపిలదత్తు కౌటిల్య గోత్రంలో పుట్టిన చాణక్యుడి పరంపరకు చెందినవాడు. అతని కుమారుడు నరేంద్రదత్తు. కౌటిల్య గోత్రంలోని చాణక్యుడు రాజనీతి, అర్థశాస్త్రాలకు సంబంధించిన ప్రామాణిక గ్రంథాలను రచిస్తే, అతని తరువాతి నరేంద్రుని పూర్వీకు లందరూ వాటికి కాలానుగుణంగా కొత్త భాష్యం చెప్పారు. పాళనరసింహుడి వంశీయులు కొంతకాలం అంతర్గత విభేదాల వలన అధికారానికి దూరంగా ఉన్నా వీరు మాత్రం తమ పదవికి దూరమవలేదు. వీరి లక్ష్యం రాజు వైదిక ధర్మం తప్పకుండా చూడటమే. ఈ చట్రంలో ఇరుక్కొని వీరిరువురి వంశాలలో ఎన్ని తరాలు మారినా సమాజాన్ని పట్టిపీడిస్తున్న ఒక రుగ్మతని మాత్రం రూపుమాపలేకపోయారు. దీని వలననే రాజ కుటుంబానికి ఎంతమంది శత్రువులున్నారో, రాజగురువు కుటుంబానికి కూడా అంతేమంది శత్రువులున్నారు.

మంచి పని చేయటానికి మిత్రుల కన్నా శత్రువులు ఎక్కువమంది ఉంటారు. ఈ తరంలో పాళనరసింహుడు, కపిలదత్తు సమాజాన్ని మార్చేందుకు ప్రయత్నించి నప్పటికీ వారి చుట్టూ వుండేవారే అత్యంత బలంగా దాన్ని వ్యతిరేకించటం వలన కనీసం దానిని ముట్టుకునే ప్రయత్నం కూడా చేయలేకపోయారు. కాని విజయనరసింహుడైనా వీటి మీద దృష్టి సారిస్తాడని, తనని ఆడంబరాలకు, మిధ్యా జ్ఞానానికి దూరంగా అనుభవ జ్ఞానానికి దగ్గరగా పెంచాడు. విజయనరసింహుడు తండ్రి అభిలషించినట్లే ఒక మంచి సంస్కరణావాది, మానవతావాది అయ్యాడు. అది విజయనరసింహుడితో మాట్లాడిన ఎవరికైనా అర్థమౌతుంది. అందుకే త్వరలో జరగబోతున్న యువరాజు పట్టాభిషేకం రాజు ఆంతరంగీకులకు చాలామందికి రుచించటం లేదు.

పాళనరసింహుని పేరుతో రాజ్యంలో అధికారాన్ని అనుభవిస్తున్న వారు ఒక కూటమిగా ఏర్పడి నిరంకుశ పాలన సాగిస్తున్నారు. వారు స్వార్థంతో చేసే పనులతో కశ్యపాపురంలో దాదాపు అరాచకం తాండవిస్తోంది. రాజు పేరుతో ఇవన్నీ సాగుతుండ టంతో అత్యధిక ప్రజానీకానికి తమకు జరుగుతున్న అన్యాయాలపై రాజు మీద గుర్రుగా ఉన్నారు. ప్రజలలో అసంతృప్తి నివురుగప్పిన నిప్పులా ఉంది. **ఏదైనా ఆసరా దొరికితే తిరుగుబాటుకు సిద్ధంగా ఉన్నారు.**

ఈ సమయంలోనే యువరక్తం ఉన్న విజయనరసింహుడి పట్టాభిషేకానికి రంగం సిద్ధమౌతోంది. యువరాజు మనస్తత్వం తెలిసిన వారెవరైనా తను అధికారంలోకి వస్తే ఇప్పటివరకు తాము అనుభవిస్తున్న అధికారం పోతుందని భయపడుతున్నారు. యువరాజు అధికారంలోకి వస్తే తమ ఆటలు ఎంతో కాలం సాగవని వారికి తెలుసు. అంతే కాకుండా

ఇప్పటి వరకు ఈ అధికారాన్ని అడ్డు పెట్టుకుని సాగించిన అరాచకాలన్నింటిని విచారించి శిక్షించాలని యువరాజు అనుకుంటున్నట్లు కూడా పుకార్లు పుట్టాయి. దానితో వారందరు బయటకి వెళ్ళగక్కకపోయినా ఏదైన అదను దొరికితే విజయనరసింహుడి పీడను వదిలించుకోవాలని చూస్తున్నారు. **దురదృష్టవశాత్తు యువరాజు మంచి మనస్తత్వం గురించి బాధలుపడుతున్న సామాన్య ప్రజలకు తెలియదు.**

రాజుకు ఎక్కడో ఉన్నవారు ఏదో చేస్తారనే భయంకంటే, రాజ్యంలో నెలకొన్న అనిశ్చితిని ఆసరాగా తీసుకొని తనకు దగ్గరగా ఉన్నవారే యువరాజుకు హాని తలపెడతారని భయపడుతున్నాడు. అందుకే కపిలదత్తు యువరాజును ప్రవాసం పంపించే ప్రస్తావన తీసుకురాగానే పెద్దగా అభ్యంతరం చెప్పలేదు. కాని ఇప్పుడు అభ్యంతరం అంతా యువరాజు వద్దనుండే. యుద్ధ సమయంలో రాజ్యాన్ని రక్షించే బాధ్యత తీసుకోకుండా ప్రాణాలకు భయపడి పారిపోవటం ఇష్టం లేదని విజయనరసింహుడు పదే పదే తన తండ్రితో వాదులాడుతున్నాడు. నరేంద్రుడు మాత్రం ప్రవాసం అంటే వనవాసం లాంటిదే అనుకున్నాడు. రాజ్యంలోని పరిస్థితులు చక్కబడిన తరువాత తిరిగి రావచ్చుననే అభిప్రాయంతో ఉన్నాడు.

సంస్కరణాభిలాషి అయిన విజయనరసింహుడు ఎప్పటికైనా రాజు అయితే రాజ్యాన్ని ఉన్నతంగా పరిపాలించగలడని పాళనరసింహుడు అభిలషిస్తున్నాడు. తన ఆలోచనలో తన వారసత్వాన్ని కాపాడుకోవాలనే ఆత్రుత కూడా ఉంది. ప్రస్తుతం వెనుకడుగేసినా పరిస్థితులు బలంగా ఉన్నప్పుడు విజయనరసింహుడు వాటి ఆసరాగా రాజు కాగలడని అనుకుంటున్నాడు.

తనకి తన కుమారుడితో వియోగం తప్పదని అర్థమవటంతో విజయనరసింహుడి మీద రాజు అమితమైన వాత్సల్యం చూపిస్తున్నాడు. విజయనరసింహుడికి ఇది బాధగా అనిపించింది. తన ఇరయ్యేళ్ల జీవితంలో తన తండ్రి తనతో ఎప్పుడూ ఇలా లేడు. అతి గారాబం తనని అహంకారిగా చేస్తుందని, లోకజ్ఞానం అలవడదని తనని కూడా ఒక సామాన్య పౌరుడిలా పెంచాడు. కానీ ఇప్పుడు రాజు ప్రతి విషయంలో అలా చేయాలి, ఇలా చేయాలి అని అప్పగింతలు చెబుతున్నాడు. విజయనరసింహుడు స్వతహాగా ధైర్యవంతుడు. కానీ తన తండ్రి అమితమైన ప్రేమను చూపిస్తూ మరణాన్ని ఆహ్వానిస్తున్నట్లు అలా అప్పగింతలు చెప్తుంటే అతనికి కన్నీటిధార ఆగలేదు. తండ్రి ఆకాంక్ష మేరకు రాజ్యం నుండి ప్రవాసం వెళ్ళటానికి ఒప్పుకున్నాడు అని అనటంకన్నా బలవంతం మీద అతనిని పాళనరసింహుడు ఒప్పించాడనవచ్చు.

# 5

**సు**మారు ఆరువేలమంది ఆశ్వికదళం ఇతర సామాగ్రితో కుటుంబసభ్యుల వీడ్కోలు మధ్య హింద్ దిశగా కదిలింది ఖాసిం సైన్యం. ఎడారులు, పచ్చిక మైదానాలను దాటి మూడు నెలల ప్రయాణం తర్వాత చంద్రబాగా నది ఒడ్డుకు చేరుకున్నారు. సిల్క్ రహదారి అందరికీ తెలిసిన దారే. ఆ దారిలో ఇంతమంది సైన్యంతో ప్రయాణించటం అంటే అందరికీ తెలిసేలా దొంగతనం చేయటమే. అందుకే దానికి సమాంతరంగా ఉండే వేరేదారిని ఎంచుకోవాల్సి వచ్చింది. ఆ దారిలోని వాతావరణ మార్పులు ఖాసిం సేనలను కొంత ఇబ్బంది పెట్టినప్పటికీ మొత్తం మీద ప్రయాణం ఊహించినంత ఒడిదుడుకులు లేకుండానే జరిగింది. ఖాసిం సేనలు చంద్రబాగా నదికి కొద్దిదూరంలో సూర్య దేవాలయానికి రథసప్తమి వేడుకలకు వచ్చే యాత్రికుల్లా గుడారాలు నిర్మించుకొని ప్రయాణ బడలిక నుండి విశ్రాంతి పొందుతున్నారు.

ఖాసిం సేనలు ఇక్కడికి చేరుకునేసరికి దట్టమైన చలికాలం నడుస్తుంది. అరేబియా ఎడారిలో భయంకరమైన ఎండలకు అలవాటుపడ్డ వారు ఇక్కడి పరిస్థితులను తట్టుకోలేక పోతున్నారు. ఖాసింతోపాటు చాలామంది సైనికులు చలివల్ల విపరీతమయిన యాతన పడుతున్నారు. రాత్రి అవుతుందంటే మళ్ళీ పగలు చూస్తామో లేదో అన్నంతగా వారు భయపడుతున్నారు. చాలామంది చలిజ్వరాల బారినపడి శక్తిహీనులయ్యారు. ఈ సమయంలో కశ్యపాపురం మీద దాడిచేసి దానిని వశపరచుకోవటం కష్టమని ఖాసింకి అర్థమైంది. ఏదో శక్తి కశ్యపాపురాన్ని అలా కాపాడుతూ ఉండి, తమకు ఈ దుర్గతి పట్టడానికి కారణమయి ఉంటుందేమోనని ఆలోచించే వరకు వెళ్ళింది అతని నిరాశ.

ఈ పరిస్థితులలో ఏ సహాయం లేకుండా ముందుకు సాగటం అసాధ్యం అని ఖాసింకి అర్థమయింది. ఖాసింని రోజూ రకరకాల వ్యక్తులు కలిసి చర్చిస్తున్నారు. వారిలో పడవలు నడిపేవారు, ఆహారం సరఫరా చేసేవారు ఉన్నారు. కాని **ఖాసిం ఎదురుచూపులు మాత్రం ఒకడి కోసం.** అతను వచ్చి తనకు మద్దతు ఇస్తే కానీ తన దండయాత్ర విజయవంతం కాదు. పడవలు నడిపేవారితో గత మూడు రోజులుగా చేస్తున్న చర్చలు ఫలించాయి. వారందరు తమ పడవలను ఏ సమయంలోనైనా సైన్యం అవసరాలకు తగ్గట్లు ఉపయోగించుకోవచ్చునని హామీ ఇచ్చారు. దానికి ప్రతిఫలంగా వారికి కొంత బంగారం మరియు రుచికరమయిన ఆరక్ పానీయం దక్కింది.

ఖాసిం ముందున్న ప్రధాన సమస్య తనకు రాజ్యం నుండి దొరుకుతుందనుకున్న మద్దతు దొరకకుండా నదిని దాటాలా వద్దా అని. తీరా మొండిగా నదిని దాటాక జ్వరాలతో మూలుగుతున్న తన సైన్యానికి ఏమాత్రం గట్టి ప్రతిఘటన ఎదురైనా ముందుకు వెళ్ళలేక,

వెనక్కి రాలేక చావుదెబ్బ తినడం ఖాయం. ఇలాంటి ఆలోచనలతో ఖాసిం ఒక రోజు తాము బస చేసిన గుడారాలను గమనిస్తూ నడుస్తున్నాడు. ఒక గుడారంలో జ్వరంతో బాధపడుతుతున్న ఇద్దరు సైనికుల మాటలను విన్నాడు.

'మనమూ మనుషులమే కదా. మనకు సంసార సుఖాలు కావాలి. అందరిలాగే కుటుంబంతో గడుపుతూ హాయిగా ఉండాలి. ప్రతి యుద్ధం తరువాత కుటుంబంతో గడపవచ్చనే ఆశ ఉంటుంది. కాని ఆ ఆశ తీరకుండానే ఇంకో యుద్ధానికి పురమాయిస్తు న్నారు. యుద్ధంలో గెలిచినపుడు ఎంతోమందిని బానిసలుగా పట్టుకుంటాము. వారిలో అందమయిన యువతులు కూడా ఉంటారు. వారితో చనువు పెరిగేలోగా వెనుకకు పిలిపించి ఇంకొక యుద్ధమంటూ మనల్ని పంపిస్తున్నారు. ఏ యుద్ధంలో ఎవరు గెలుస్తారో ఎవరు చెప్పగలరు. ఎవరు గెలిచినప్పటికీ సైన్యంలో ఎవరు మరణిస్తారో ఊహించలేం. జీవితమంతా అనవసరమైన పోరాటాలతో నష్టపోతున్నాము. ఉమ్మాయద్ తన కోటను దాటకుండా హాయిగా ఆరక్ సేవిస్తూ మనం కష్టపడి యుద్ధంలో గెలిచిన యువతులతో సౌఖ్యంగా ఉంటూ మనల్ని మాత్రం యుద్ధానికి ఉసిగొల్పుతున్నాడు. అతని ఎత్తుగడలలో మనమందరం పావులుగా మారాము. గెలిచిన ఖ్యాతి అంతా ఉమ్మాయద్‌కి దక్కుతుంది. ఒకవేళ ఓడిపోయి మరణిస్తే ఇంకొంతమందిని రెచ్చగొట్టి మనలాగా, ఖాసింలాగా బలి పశువులను చేస్తారు' అని నిరాశగా వారు మాట్లాడుకుంటున్నారు.

తనని కూడా ఒక తెలివితక్కువ వాడి కింద జమకట్టిన వారిని వెంటనే తన ఖడ్గానికి బలిచేయాలన్నంత కోపమొచ్చింది ఖాసింకి. కాని సావధానంగా ఆలోచిస్తే అవన్నీ తన మనసులోనూ ఉన్నవే. ఆ ఆలోచనలతోనే తన గుడారానికి వచ్చాడు. ఖాసింకి తన కుటుంబం గుర్తుకువచ్చింది. తన పిల్లలు, వారి భవిష్యత్ గురించి ఆలోచన లేకుండా మృగంలా ఎప్పుడూ యుద్ధంలో జీవితాన్ని వృధా చేసుకుంటున్నానని మళ్ళీ ఆలోచన మొదలైంది. సాధారణంగా యుద్ధంలో గెలిచినపుడు ఎంతో కొంత సౌఖ్యాలు దక్కుతాయి. కానీ తనకు మాత్రం **యుద్ధంలో గెలిస్తే మరొక యుద్ధం దక్కుతుం**ది అనుకున్నాడు.

మళ్ళీ ఆ సైనికుల గురించి ఆలోచించాడు. ఇక్కడ ఉన్న వారందరికీ సైనికుడిగా ఉండటం అనేది ఒక ఉద్యోగం. తన కుటుంబాన్ని పోషించటానికి ఒక దారి మాత్రమే. వారెవరికీ దేవుడి రాజ్యస్థాపన ప్రాథమిక అంశం కాదు. అది బయటకు కనబడే అంశం మాత్రమే. దేవుని రాజ్య స్థాపనలో ప్రాణాలను అర్పిస్తే పరలోక సుఖాలు దక్కుతాయి అనే మత్తు కూడా కొంతమందిని యుద్ధానికి ఉసిగొల్పుతుంది. మనిషిగా పుట్టి తన విలువైన జీవితాన్ని సుసంపన్నం చేసుకోకుండా మరణాంతరం కలిగే పరలోకపు సుఖాలకోసం ఎందుకు దారులు వెతకాలి. అవి ఉంటాయని ఎవరికి మాత్రం తెలుసు. అలా పరలోక సుఖాలు దొరుకుతాయని చెప్పిన మతం మీద నమ్మకం ఉన్నప్పుడు

అందరూ మరణానికి ఎందుకు భయపడుతున్నారు. దీనినిబట్టి **మనిషి జీవితంలో మతం కూడా ఒక ఉపరితల అంశమే** అనుకున్నాడు.

'తమలాగే తమ శత్రు సైనికులు కూడా వారి కుటుంబం కోసం ఉద్యోగం నిర్వర్తించేవారే కదా అని ఆలోచించాడు. అయినా వారిని దోచుకోవటానికి వారి మీద అవిశ్వాసులు అనే ముద్ర వేసి అమాయకులైన ప్రజలను వధిస్తున్నాం. ఖాశింకి ఈ 'అవిశ్వాసులు' అనే కారణం చేత దండయాత్రలు చేయటం, జనన హననం చేయటం ఎంతవరకు న్యాయం అని అనిపించింది. వారు మన ధర్మానికి అవిశ్వాసులు అయితే, వారి ధర్మానికి మనం కూడా అవిశ్వాసులమే కదా. పరస్పర గౌరవాభిమానాలు ఉండటం, ఇతరుల స్వేచ్ఛను గౌరవించటమే కదా ధర్మానికి అసలైన అర్థం. ఈ నెపంతో జనన హననం జరిగితే ఇక ఈ భూమి మీద మిగిలేది ఎవరు. అందరూ ఏదో ఒక ధర్మానికి బద్ధులై వుంటారు. కొంచెం అటు ఇటుగా అన్ని ధర్మాలు మంచినే బోధిస్తాయి. ప్రపంచంలోని మనుషులందరు ఒకే ధర్మానికి కట్టుబడమని, ఒకే విధంగా ఆలోచించమంటే ఎలా కుదురుతుంది. అంతెందుకు ఇస్లాం ఇప్పటికే శాఖోపశాఖలుగా విడిపోయింది. అంటే ఇస్లాంను అనుసరిస్తున్న వారు కూడా ఒకరికి ఒకరు అవిశ్వాసులే కదా. ఒకే విషయం ఒక్కో మనిషికి ఒక్కో విధంగా అర్థం అవుతుంది. అతను ధర్మాన్ని పాటిస్తున్నప్పటికీ తను అనుసరించే విధానాలు వేరుగా వుంటాయి. ఈ విధంగా ప్రతి మనిషి ఇంకొక మనిషికి శత్రువే అవుతాడు' అని అనుకున్నాడు.

ఖాసింకు భయం మొదలై కుటుంబం మీద, జీవితం మీద మమకారం పెరిగేసరికి తత్వం బోధపడుతోంది. మళ్ళీ ప్రస్తుతం జరగాల్సిన దాని గురించి ఆలోచన మొదలైంది.

ఇవన్నీ సైన్యంలోకి రాకముందే ఆలోచించుకొని ఉండాలి. ఒక్కసారి సైన్యంలో చేరిన తరువాత తమ పైవారు చెప్పింది చేయక తప్పదు అనుకున్నాడు. ఇంత దూరం వచ్చాక వెనకడుగు వేయలేం. వారి మాటలను ఉపేక్షిస్తే అవి మిగతా వారికి కూడా చేరి సైన్యంలో ఉన్న అసంతృప్తి తిరుగుబాటుగా మారే అవకాశం ఉంది. అందుకే వారితో రాత్రి భోజనాన్ని ఏర్పాటు చేశాడు. వారికి ఉన్న అనుమానాలను నివృత్తి చేస్తూ అల్లా పేరుమీద మంచి మాటలను చెప్పి వారిని శాంతింపచేశాడు.

ఖాసింకు ఉన్న బలం అందరిని ఒకతాటిమీద నడిచేటట్లు చేయడం, తన సైన్యానికి ఉత్సాహం కలిగించడంలో ముందుంటాడు. అందరికీ తానున్నానంటూ వారి సమస్యలను తన సమస్యలుగా భావించి పరిష్కరిస్తూ ఉంటాడు. అందరికన్నా తానే ముందుగా యుద్ధరంగంలోకి దూకుతాడు. ఖాసింతో కలసి ఒకసారి పనిచేస్తే యుద్ధరంగంలోకి కూడా ప్రణయరంగంలోకి దూకినంత ఇష్టంగా దూకుతారు సైనికులు. అందుకే ఖాసిం అద్భుతమైన సేనాని.

ఇంత చాకచక్యం ఉంది కాబట్టి ఖాసిం మీద ఉమ్మాయద్‌కు అంత గురి. ప్రతి యుద్ధంలోనూ ఖాసిం పాత్ర ఉండాలనుకుంటాడు. ఖాసిం యుద్ధం మొదలవకుండానే తన వ్యూహాలతో శత్రువుని దెబ్బతీయగలడని అతని నమ్మకం. ఇక కదనరంగంలోను ఖాసింకి ఎదురునిలచి పోరాడటం ఎవరితరం కాదు. ఈ గుణాలే ఖాసిం ఎదుగుదలకు కారణం. ఇవే ఇప్పుడు ఖాసిం ఈ చట్రంలో నుండి బయటకు వెళ్దామన్నా ప్రతిబంధకాలయ్యాయి. ఖాసిం లాంటి గెలుపు గుర్రాన్ని వదులుకోటానికి ఉమ్మాయద్ సిద్ధంగా లేడు. అతనిని తన అదుపులో ఉంచుకోవటానికి ఎంతటి దారుణానికైనా ఉమ్మాయద్ వెనుకాడడు.

ఒక రోజు రాత్రి ఖాసిం తనతో ఉన్న సూఫీ మత గురువుతో కలిసి ఆఖరి ప్రార్థన ముగించి, పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. ఒక కాపలా సైనికుడు వచ్చి ఎవరో ఒక వ్యక్తి వచ్చాడని, అతను మాట్లాడిన మాటల్లో మీ పేరు, సూఫీ పేరు చెప్పాడని, ఇంకా తనకు అర్థమైంది అతని పేరు రంగడు అని చెప్పాడు ఖాసింతో. **రంగడు అనే పేరు వినగానే వారిద్దరు ఒకరి మొఖాలు ఒకరు సంతోషంగా చూసుకున్నారు.**

ఖాసిం ఆ కాపలా సైనికులతో రంగడి మీద దాడి చేయండి, కాని చంపకుండా గాయపరచమని చెప్పాడు. రాజ్యానికి వెన్నుపోటు పొడుస్తానని వచ్చి తమతో చేతులు కలుపుతానన్న రంగడి మీద ఎందుకు ఖాసిం దాడి చేయమంటున్నాడో అక్కడి వారికి అర్థం కాలేదు. కానీ ఖాసిం మనస్సులో రంగడు అతనితో కలిసివచ్చేవారు తనకెంత ఉపయోగపడతారో తెలుసుకోవాలనుకున్నాడు.

తనమీద దాడికి తెగబడిన ఇద్దరు సైనికులను తన యుద్ధ నైపుణ్యంతో గాయపర్చాడు రంగడు. ఈలోగా స్వయంగా ఖాసిం, సూఫీ అక్కడికి వచ్చి రంగడిని ఆహ్వానించారు. లోపలికి వచ్చిన రంగడికి, ఖాసింకి మధ్య జరిగిన సంభాషణలో అప్పటికే అక్కడి భాషతో పరిచయమున్న ఆ సూఫీ బోధకుడు అనువాదకర్తగా వ్యవహరించాడు.

చాలాసేపటి తరువాత రంగడు విప్పారిన మొహంతో, చేతిలో ధనం ఉన్న సంచితో బయటకు రావటం, ఖాసిం, సూఫీ వచ్చి ఆతనిని సాగనంపటం రంగడి మీద దాడి చేసిన సైనికులకు విచిత్రంగా తోచింది. రంగడు వెళ్లడంతోనే తాను హింద్‌ను గెలిచినట్లేనని ఆనందంతో గట్టిగా అరిచాడు ఖాసిం. అక్కడి వారంతా ఖాసిం వ్యూహం అర్థంకాక ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

రంగడు ఇచ్చిన సలహా మేరకు రథసప్తమి రోజున యుద్ధాన్ని మొదలుపెట్టాలని

నిర్ణయించారు. కశ్యపాపురం సైనికులు ప్రతిఘటించే దానినిబట్టి యుద్ధం రెండు రోజుల కన్నా ఎక్కువ జరిగే అవకాశం లేదని నిర్ధారణకు వచ్చాడు ఖాసిం. రంగడి రాకతో యుద్ధంలో బలాబలాలు తారుమారయ్యాయి. ఈ యుద్ధం ఈ దేశం మీదకి మొట్టమొదటి ముస్లింల దండయాత్ర అనే చారిత్రక ప్రాధాన్యం ఉన్నా, ఇదేమి చరిత్రలో కనీవినీ ఎరుగని స్థాయిలో భయంకరంగా జరగబోవటంలేదు. యుద్ధంలో ఆరితేరిన ఖాసిం సైన్యానికి అంతగా యుద్ధానికి సిద్ధపడని ఐకమత్యం లేని కశ్యపాపురం సైన్యానికి జరుగబోతోంది. భీకరమైన యుద్ధం ఇరువైపులా సైనికులు ఒకరితో ఒకరు తలపడి వీరమరణం పొందటం లాంటివన్నీ నిజంగా జరగవు. శత్రువులను బలహీనపరిచే ఇలాంటి వ్యూహాలతో యుద్ధం ఎవరు గెలవబోతున్నారన్నది ఇంచుమించుగా నిర్ణయమైన తరువాతే ప్రారంభమవుతుంది.

ఈ యుద్ధానికి ఉన్న ప్రాముఖ్యత అంతా ఒక్కటే. మొట్టమొదటిసారి ఈ పవిత్ర భూమి పరాయివారి దాశ్య శృంఖలాలలోకి వెళ్ళబోతుందేమో అని. ఇంతకు ముందు ఈ దేశాన్ని ఆక్రమించుకుందామని ప్రయత్నించిన వారందరూ ఆ కార్యంలో కృతకృత్యులు అవలేకపోయారు. హింద్‌కి ముఖద్వారంగా ఉన్న కశ్యపాపురాన్ని ఆక్రమించుకుంటే మొత్తం ఈ దేశాన్ని ఆక్రమించుకోవటం వారికి కష్టమేమీ కాదు.

రథసప్తమి ముందు రోజు రెండు రోజులకు సరిపడా ఆహార పదార్థాలను తయారు చేసుకున్నారు. తమ వద్ద ఉన్న తోలుతిత్తులలో మంచినీటిని నింపారు. గుర్రాలను సైతం జాగ్రత్తగా మేపారు. ఆరువేలమంది సైన్యం విడతలు విడతలుగా పడవలలో నదిని దాటడం కష్టమని ఖాసింకు తెలుసు. యుద్ధవ్యూహాలలో ఆరితేరిన ఖాసింకు ఒక ఉపాయం తట్టింది. చీకటి మొదలవగానే పడవలను నదిలో ఒకదానిపక్కన ఒకటి పెట్టి పడవలతోనే ఒక వంతెనను తయారుచేశాడు. అనుకున్న విధంగానే అతి తక్కువ వ్యవధిలో సైన్యం మొత్తం ఆ వంతెన మీదుగా అశ్వాలతో సహా చంద్రబాగా నదిని దాటారు.

కొద్ది దూరం ప్రయాణించగానే కోట గోడను చేరారు. కాగడాలతో కదలి వస్తున్న సైన్యాన్ని చూడగానే కోట గోడపై నుండి బాణాల వర్షం కురిసింది. దానితో ఖాసిం సైన్యంలో కొద్దిమంది నేలకొరిగారు. ఒక్కసారిగా అప్రమత్తమైన ఖాసిం సైన్యం తమ వద్దనున్న మంగోలియన్ బాణాలకు పని కల్పించింది. సాంప్రదాయ బాణాల కన్నా అత్యంత వేగంతో దూసుకుపోయే మంగోలియన్ బాణాల దెబ్బకు కశ్యపాపురం సైన్యంలో కూడా కొంతమంది మృత్యువాత పడ్డారు. ఖాసిం చేయి విచిత్ర సంజ్ఞ చేయగానే

ఫిరంగిలాంటి యంత్రం నుండి ఒక పెద్ద బండరాయి బలంగా వెళ్ళి కోటగోడను తాకింది. దానితో గోడ కంపించింది కాని ఏమాత్రం చెక్కుచెదరలేదు. ఇంతలో గోడ మీద నుండి ఒక భారీ తెల్లటి వస్త్రం క్రిందవరకు పరచుకుంది. బాణాల వర్షం కూడా ఆగిపోయింది. దానితో తమ వ్యూహం ప్రకారం సైనికులు లొంగిపోయినట్లు ఖాసింకి అర్థమైంది. కోట గోడకున్న భారీ తలుపులు తెరచుకున్నాయి.

ఖాసిం సేన అరేబియాలో బయలుదేరినప్పుడు ప్రయాణం అంతా ఒక ఎత్తయితే కోట గోడను దాటటం ఒక ఎత్తనుకున్నాడు. కాని అత్యంత పటిష్టమైన కోట గోడ లోపలి నుండి బీటలువారి ఖాసిం ముందు చిన్నబోయింది. అందుకే తెల్లవారుజాముకల్లా ఖాసిం ఏమాత్రం కష్టపడకుండానే కోట గోడను దాటి ఠీవిగా రాజ్యంలోకి ప్రవేశించాడు.

ఆ తరువాత కూడా వారికి పెద్దగా ప్రతిఘటన ఎదురవకపోవటంతో ఖాసిం, అతని సైనికులు విహార యాత్రకు వచ్చినట్లు ప్రశాంతంగా రాజ్యాన్ని గమనిస్తూ ముందుకు సాగుతున్నారు. నగరం మొదలవకముందె వారికి కొన్ని గృహాలు కనిపించాయి. పూర్తిగా కప్పివేయని పాకలు, ఇరుకైన రోడ్లు, మాసిన బట్టలు, తైల సంస్కారంలేని, మురికితో సహవాసం చేస్తున్న ప్రజలు కనిపించారు.

వారు ఆ వాడలను దాటుకొని నగరం లోపలికి ప్రవేశించారు. విలాసవంతమైన భవంతులు వారికి దర్శనమిచ్చాయి. అందమైన రోడ్లు, వాటికిరువైపులా క్రమంగా పెంచిన చెట్లు చూడటానికి ఎంతో అందంగా ఉన్నాయి. ద్వారాలకు రంగురంగుల పూసలతో కూడిన తెరలు వేలాడుతున్నాయి. ప్రతి గృహం ముందు విశాలమైన ప్రాంగణం, కొందరి ఇళ్ళలో ప్రయాణం కోసం గుర్రపు బగ్గీలు ఉన్నాయి. కశ్యపాపురం, దాని సౌందర్యం, దానిలో నిక్షిప్తమైన ఐశ్వర్యం గురించి ఇక్కడికి వర్తకానికి వచ్చి వెళ్ళినవారు అరేబియాలో కథలు కథలుగా చెప్పేవారు. ఆ నగరాన్ని, నగరంలోని అందాలను చూడాలని ఖాసిం, అతని సైనికులు ఎప్పటినుంచో తహతహలాడుతున్నారు. ఇప్పుడు అది తమ కళ్ళ ముందు సాక్షాత్కరించటం తమ అదృష్టంగా భావిస్తున్నారు. నగర అందాలను చూస్తూ పారవశ్యంలో మునిగితేలారు. కొంత ముందుకు ప్రయాణించాక ఖాసిం సైన్యం రెండు భాగాలుగా విడిపోయింది. ఖాసిం ఆధ్వర్యంలో వారు సూర్యదేవాలయంవైపు, మిగిలిన వారందరు రాజమందిరంవైపు తరలారు.

రాజమందిరం దగ్గర జరిగిందేమిటో తెలిసిందే. మరి సూర్య దేవాలయం దగ్గర ఏమి జరిగింది.